ఆంధ్ర ప్రదేశ్
అభ్యుదయ రచయితల
సంఘం మద్రాసు
శాఖ పత్రిక

విడి ప్రతి:
60 పైసలు

సాలు చందా:
ఏడు రూపాయలు

ముఖచిత్రం: త్వరలో విడుదల కానున్న 'ఒక ఊరి కథ' దర్శకుడు మృణాల్ సెన్, ముఖ్య పాత్రధారులు వాసుదేవ రావు, మమతా శంకర్. మృణాల్ సెన్ చిత్రం 'మృగయా'కు యిటీవల స్వర్ణ కమలం బహూకరింపబడింది. వాసుదేవ రావు 'చోమనదుడి' అన్న కన్నడ చిత్రంలో నాయక పాత్ర అఖిల భారత ఉత్తమ నటుని బహుమతి పొందింది. మమతా శంకర్ 'మృగయా' నాయకి.



# అభ్యుదయ

సంచిక 2 సెప్టెంబరు 1977 సంపుటి 1

గత నెల 'కవితా పఠనం' కార్యక్రమం (పుటలు 12-17) తరవాత జరిగిన చర్చ ఉద్వేగంగా వుందే కాని, దానిలో వేడి పుట్టినంతగా వెలుగు ప్రసరించ లేదని చెప్పవలసి వుంటుంది. కవిత్వం (సాహిత్యం కూడా) వల్ల ప్రజలకు ఏమీ ఉపయోగం వుండడం లేదనీ, కవుల సమావేశాల్లో జరిగేది ఒకరినొకరు పొగడుకోవడమేననీ వచ్చిన అభిప్రాయాన్ని ఎదుర్కోవడానికి, అభ్యుదయ రచనలతో ప్రజలను చైతన్యవంతులుగా చేయడానికి ప్రజా నాట్య మండలి చేసిన సేవను కొందరు వివరించారు.

అయితే యీ రెండు అభిప్రాయాలూ సంపూర్ణ సత్యాలేనా అన్న విషయాన్ని నిదానంగా ఆలోచించవలసి వుంది.

తెలుగు ప్రజలలో అక్షరాస్యత 25 శాతానికి లోపు. పత్రికలు, పుస్తకాల ప్రచురణలాగానే వాటి చెలామణీ తక్కువే. ఈ కొద్దిపాటి సాహిత్యమూ బట్వాడా చేసేది కాలక్షేపపు నల్లమందు. దానిలోది ఎక్కువభాగం ఆవలింత వచ్చేవరకూ ఆస్వాదించే పదార్థం. ప్రజలకు ఉపయోగపడేది ఏ కాస్తంత వచ్చినా, అది మధ్యతరగతి విద్యావంతులకు మాత్రమే పరిమితం. అయితే సమూలంగా సమాజాన్ని పరివర్తన చేసేవారు శ్రామికులు కాని, యీ తరగతి వారు కాదు.

'పొట్ట చీల్చితే అక్షరం ముక్కలేని వాళ్లు'గా యీసడింపబడే వాళ్ళలో చెలామణీ అయ్యే జానపద సాహిత్యం, నేటి నాగరికత వురవడికి కొట్టుకపోగా మిగిలి వున్నది, ఫ్యూడల్ భావాలపుట్ట. సినిమా ద్వారా వీళ్ళనంటే సాహిత్యం పుట్టించే రుచులు, బుద్ధులు నాపి రకపువి: మెదడును మొద్దుబారించేవి.

ఈ పరిస్థితివల్ల—సాహిత్యం ద్వారా ప్రజోద్ధరణ అన్న ఆదర్శమైతే గొప్పదే గాని, అది అందుబాటులోకి రావడం లేదు. అభ్యుదయ రచయితలు, ప్రజా నాట్యమండలి ఒకప్పుడు సాహిత్యాన్ని ప్రజలకు అందుబాటులోకి తెచ్చారు. ఇప్పుడు పునరుద్ధరించవలసిన ఆదర్శ మిది.

# అడివి బాపిరాజు "నారాయణ రావు"

శ్రీకాంత్

అడివి బాపిరాజు రచించిన 'నారాయణరావు' నవలలో మూల కథ సర్వసామాన్యమైన తెలుగు సినిమా లాంటిది. నారాయణ రావు అనే సౌందర్య రాసి, సుగుణాల ఖనిపై విశ్వలాపురం జమీందారు లక్ష్మీసుందర వర ప్రసాద్ రావుగారి కన్నుపడడం, ఆయన తన కూతురు శారదకు నారాయణ రావే అన్ని విధాలా తగిన వరుడని యెంచి కాళ్ళు కడిగి, కన్యాదానం చేయడం, పెండ్లికొడుకు తమఅంతస్తుకు తగడని జమీందారు బంధువర్గం నారాయణ రావును చిన్నచూపు చూడడం, దీనితో నారాయణ రావుపై శారదకు ప్రేమ అంకురించక పోవడం, జమీందారు బావమరది సర్వావలక్షణ సంపన్నుడు జగన్మోహనుడు, నారాయణరావు పాలిట విలన్‌గా మారి శారద, నారాయణరావుల దాంపత్యం సక్రమంగా సాగకుండా అడ్డుపడడం, చివరకు భంగపడి రంగం నుండి నిష్క్రమించడం, నవలాంతంలో శారద తన భర్త దైవత్వాన్ని గ్రహించడంతో దంపతుల జీవితంలో వసంతం విరియడం—ఇదీ నాలుగు దశాబ్దాల క్రితం ప్రచురణై పేరుతెచ్చుకున్న యీ నవల కథ.

అయితే ఈ నవలలోని వివిధ పాత్రలకూ, భారత స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి స్థితిగతులకూ అవినాభావ సంబంధం వుంది. నవలలోని సంఘటనలేవీ భారత స్వాతంత్ర్యోద్యమానికి ప్రత్యక్షంగా సంబంధించినవి గాకపోయినప్పటికీ, వివిధ పాత్రల సంభాషణలలో 1921-1930 మధ్యకాలంలో జరిగిన భారత స్వాతంత్ర్యోద్యమం మనకు రేఖా ప్రాయంగా దర్శనమిస్తూ వుంది.

ఈ నవలా రచయిత కీ. శే. అడివి బాపిరాజు రాజమండ్రి, ఆర్ట్స్ కాలేజీలో బి. ఏ. చదువుతూ 1921 లో అసహాయోద్యమంలో జైలుకు వెళ్ళారు. తరువాత బందరు జాతీయ కళాశాలలో ప్రమోదకుమార ఛటర్జీ వద్ద చిత్రలేఖనం అభ్యసించారు. పిమ్మట మద్రాసు లా కాలేజీలో బి. ఎల్. పట్టం పొంది కొద్ది కాలంపాటు ప్లీడరు పనిచేశారు. అందుకే రచయిత తన నవలా నాయకుడైన నారాయణ రావును తన మూసలోనే మలిచారు. నారాయణ రావు సైతం అసహాయోద్యమంలో జైలుకు వెళ్ళివచ్చి, మద్రాసు లా కాలేజీలో చదువు కొనసాగించాడు. అడివి బాపిరాజు వలెనే, నారాయణ రావు గూడా కాంగ్రెస్‌లో 'నో ఛేంజర్ల' గ్రూప్‌కు చెందినవాడు. నారాయణ రావు మామ లక్ష్మీసుందర వరప్రసాద రావు స్వరాజ్య పార్టీకి అందుకే ఈ నవల రాజకీయాలను పరిశీలిద్దాం.

1921 లో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించారు. 1922 లో జరిగిన చౌరాచౌరీ దురంతాలతో కలత చెంది ఈ ఉద్యమాన్ని విరమించారు. ఇలా గాంధీజీ అర్ధంతరంగా ఉద్యమాన్ని విరమించడం కాంగ్రెస్‌లో చాలా మందికి నచ్చలేదు. దీని ప్రత్యామ్నాయ మేమిటనే ప్రశ్న వచ్చింది. గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని ప్రతిపాదించారు. హరిజనోద్ధరణ, మద్యనిషేధం, గృహపరిశ్రమలు, బేసిక్ విద్యావిధానం— ఈ కార్యక్రమం.

అప్పటికే 1909 మింటో-మార్లే సంస్కరణలు, 1919 మాంటేగూ - చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల మూలంగా ధనిక వర్గాలకూ, పెద్ద

రైతులకూ ఓటు హక్కు వచ్చింది. రాష్ట్రాలలో ద్వంద్వ పాలన ఏర్పడింది. శాసనసభలలో పరిమితంగానైనా ప్రజావాణి వినిపించే అవకాశం కలిగింది.

ఈ ఎన్నికలలో పాల్గొనకుండా, రాజకీయ రంగానికి దూరంగా వుండి, నిర్మాణ కార్య క్రమంలో పాల్గొనాలన్న గాంధీజీ ఆలోచనకు కట్టుబడి వున్నవారినే 'నో ఛేంజర్లు' అని అన్నారు. వీరిలో రాజాజీ, రాజేంద్ర ప్రసాద్, వల్లభాయ్ పటేల్, జవహర్లాల్ నెహ్రూ మున్నగువారున్నారు.

గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాన్ని ఆపివేయంతో స్వాతంత్ర్య పోరాటం వెనుక పట్టు పట్టిందనీ, ఈ పోరాటాన్ని శాసనసభల లోకి కూడా తీసుకొనిపోయి, శాసన సభలను పోరాట వేదికలుగా మార్చాలని భావించిన కొందరు కాంగ్రెస్ పెద్దలు 1925లో స్వరాజ్య పార్టీని స్థాపించి శాసన సభలకు పోటీ చేశారు. వీరిలో చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ, విఠల్‌భాయ్ పటేల్, టంగుటూరి ప్రకాశం పంతులు, సత్యమూర్తి ప్రభృతులు వున్నారు.

ఈ దశలోనే 1927 లో బ్రుస్సెల్స్‌లో జరిగిన యాంటీ ఇంపీరియలిస్ట్ లీగ్ మహాసభలో నెహ్రూ పాల్గొని వచ్చారు. ఆ మహాసభ దాదాపు కమ్యూనిస్టుల యాజమాన్యాన జరిగింది. అప్పటికే అక్టోబరు మహా విప్లవం విజయవంతమై, ప్రపంచ విముక్తి పోరాటాలకు వేగుజుక్కగా భాసిస్తూ వుంది. ఈ మహాసభలో పాల్గొన్న నెహ్రూపై సోషలిజం ప్రభావం పడింది. తత్ పర్యవసానంగానే ఆయన 1928లో జరిగిన మద్రాసు కాంగ్రెస్‌లో నేతాజీ సుభాష్‌చంద్ర బోస్‌తో కలిసి సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. దీనిని గాంధీజీ వ్యతిరేకించారు. యువకులు తమ పట్టు విడువక పోవడంతో, దీనికి రాజీగా మోతీలాల్ కమిటీ ఏర్పడింది. ఒక సంవత్సరంలోగా బ్రిటిష్ వారు భారత దేశానికి అధినివేశ ప్రతిపత్తి యివ్వకపోతే సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానానికి అందరూ అంగీకరించాలన్నదే ఆ రాజీ. బ్రిటిష్ వారు అధినివేశ ప్రతిపత్తి గూడా యివ్వక పోవడంతో 1929 జనవరి 26 వ తేదీన రావి నది ఒడ్డున జరిగిన లాహోర్ కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించింది.

ఈ నవలా నాయకుడు 'నో ఛేంజర్': ఆ నాడు మద్రాసులో మంత్రులుగా వున్న పానగల్లు రాజానూ, బొబ్బిలి రాజానైనా సమర్థించగలడు గానీ, స్వరాజ్య పార్టీ వారిని మాత్రం సహించలేడు. మద్రాసు శాసన సభలో స్వరాజ్య పార్టీ ప్రతినిధి అయిన శ్రీ లక్ష్మీసుందర ప్రసాదరావు ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం అవసరమని వాదిస్తే, చిన్న చిన్న రాష్ట్రాలు ఖర్చుకు డబ్బుండక దివాళా రాష్ట్రాలౌతాయని నారాయణరావు వాదిస్తాడు. అధినివేశ ప్రతిపత్తి అయినా, సంపూర్ణ స్వతంత్రమైనా, రెండూ సమానమే నారాయణ రావుకు.

సంపూర్ణ స్వాతంత్ర్యం వస్తే దేశానికి చాలా నష్టమని జమీందారిగారి వాదం. తమది 'గోఖలేగారి వాదమే' నని జమీందారు గారంటారు. అంటే నాడు స్వరాజ్య పార్టీలో గూడా ఉదారవాదు లున్నారని స్పష్టమౌతూంది.

గాంధీజీ దక్షిణాఫ్రికానుండి భారత దేశానికి రాని కాలంలో సాతంత్రోద్యమానికి నాయకత్వం వహించిన గోపాలకృష్ణ గోఖలే ఉదారవాది. బ్రిటిష్ వారు భారతదేశం విడిచి పోనవసరం లేదని, భారతీయులను నీచంగాగాక, సరిసమాన స్థాయిలో చూసే ఉదారవాద బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలో కొనసాగ వచ్చుననీ ఆయన వాదన. ఆ నాడు

గోఖలే గారి ఉదార వాదానికీ, 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు'ని నినదించిన బాలగంగాధర తిలక్ అతివాదానికీ పొత్తు పొసిగింది కాదు. దీని ఫలితమే కాంగ్రెస్‌లో మితవాద, తీవ్ర వాద సంఘర్షణ. పర్యవసానం 1907 లో సూరత్ కాంగ్రెస్ విభజన. ఇదే కాంగ్రెస్‌లో మొదటి చీలిక.

ఈ నవలలో స్వరాజ్య పార్టీ ప్రతినిధి అయిన జమీందారు తీవ్ర మిత వాదాన్ని ఎంచుకున్నారు. దీనిలో వర్గప్రయోజనాలున్నాయి. బ్రిటిష్ ప్రభుత్వ అండదండలతో కొనసాగిన ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థ పది కాలాల పాటు చల్లగా వుంటేనే గానీ తమ జమీందారీ దర్జా నిలవదనే అభిప్రాయం సహజంగానే జమీందారీ వర్గానికి వుంటుంది. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నా, మరే ఉద్యమంలో పాల్గొన్నా వారి వర్గ స్వభావాలూ, వర్గప్రయోజనాలు వారికి వుంటాయి. ఇదే ఈ నవలలో జమీందారు సంభాషణల్లో మనకు గోచరించేది. దీనినిబట్టి ఆనాడు కాంగ్రెస్ సంస్థ వివిధ వర్గాల కలగూర గంప అనీ, ఇందులోని యేవర్గమూ తన ప్రయోజనాలను బలి పెట్టుకొనడానికి యిష్టపడలేదనీ స్పష్టమౌతుంది.

ఈ నవలలోని నారాయణ రావు తండ్రి సుబ్బారాయుడు 'డబ్బున్న వాళ్ళపై పేదవాళ్ళు తిరగబడిన' సోవియట్ బోల్షివిక్కు విప్లవాన్ని కీర్తిస్తాడు. "పూర్వం హిందూదేశంలో బోల్షివిజం లాంటి ఉత్కృష్ట రాజ్య పద్ధతి ఉండేదట. ఎంతవరకూ నిజమో కాని ఈ రోజున డబ్బువదిలే మహానుభావు డెవరు? గాంధీ మహాత్ము డంటివాళ్ళు ఏ పదిమందో" అని అంటాడు. అలాగే నారాయణ రావు చేత గూడా, "నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వం ఏది అంటే బోల్షివిజమనే చెప్పాలి" అని రచయిత అనిపిస్తారు.

బోల్షివిక్ విప్లవాన్ని యూరపు నంతటినీ చుట్టబెట్టనున్న ఒక మహా భూతంగా చిత్రీకరిస్తూ దుష్ప్రచారం సాగుతూ వుండడమే గాక, తరుణ సోవియట్ రిపబ్లిక్‌ను పీక నులమడానికి సామ్రాజ్యవాద కుట్రలు సాగుతున్న కాలంలో రాసిన ఈ నవలలో, రచయితకు శాస్త్రీయ కమ్యూనిజం గురించి సరైన అవగాహన లేకపోయినా, బోల్షివిక్ విప్లవ స్వరూప స్వభావాల గురించి బయటి ప్రపంచానికి సమాచారం అంతగా లేకపోయినా, బోల్షివిజాన్ని 'ఉత్కృష్ట రాజ్య పద్ధతి'గా చిత్రీకరించడం రచయితలోని ప్రగతిశీల దృక్పథానికి నిదర్శనం.

అలాగే నాటి జాతీయోద్యమంలో పెనవేసుకున్న సాంఘిక సంస్కరణ, స్వావలంబన సూత్రాలను సైతం ఈ నవల తెలియజెప్పుతూ వుంది. నారాయణ రావు వివాహ సమయంలో రాజమండ్రిలోని వితంతు వివాహ సంఘానికి భూరివిరాళం యిప్పించడంలోనూ, నాడు వనితా మానాపహరణమే పరమవ్రతంగా, ఆంధ్ర దేశంలో ప్రబలిన స్వేచ్ఛాచార సంఘం (ఫ్రీ లౌ సొసైటి) అవినీతి చర్యలను ఖండించడంలోనూ, వ్యావహారిక భాషా ఉద్యమాన్ని బలపరచడంలోనూ రచయిత సంస్కరణాభిలాష అడుగడుగునా ద్యోతకమౌతుంది.

ఈ నవలలో జాతీయోద్యమం సంఘటనల రూపంలో గాక, పాత్రల చర్చలలో మాత్రమే ప్రస్తావించ బడడంవల్ల స్వాతంత్ర్యోద్యమ చరిత్ర తెలియని సామాన్య పాఠకులకు విసుగనిపించినప్పటికీ, 1921-1930 మధ్య కాలంలోని స్వాతంత్ర్యోద్యమ పోరాటాన్ని, సామాజిక స్థితిగతుల్నీ ప్రగతిశీల దృక్పథంతో చిత్రించిన ఉత్తమ నవల 'నారాయణరావు'.

(అరసం మద్రాసు శాఖ గోష్ఠిలో
చదివిన వ్యాసానికి సంక్షిప్తం)

# ప్రేమ్‌చంద్ నిబద్ధత, నిమగ్నత

రా. సుందర రావు

ప్రేమ్‌చంద్ కాశీకి నాల్గుమైళ్ళలో గల లమ్హి గ్రామంలో 1880 జూలై 30 న ఒక కింది మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు. ఏడవ యేట తల్లి, 15 వ యేట తండ్రి గతించారు. కనుక చిన్నతనంలోనే కుటుంబ భారం ఆయన నెత్తిపై పడింది. ఉపాధ్యాయుడుగాను, డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగాను ఉద్యోగంచేసి పెద్ద కుటుంబాన్ని పోషించాల్సి వచ్చింది. రచయితగా ఎంత పేరు గడించినా జీవితాంతం యీ దారిద్ర్యం ఆయన్ని వదల్లేదు అనేకంటె ఆయన దాన్ని కోరి వరించారని చెప్పవచ్చు. మొదటి పెళ్ళి విఫలంకాగా, 1906 లో ఆయన బాలవితంతువయిన శివరాణి దేవిని పెళ్ళాడారు. ఇంటా బయటా ఆయనకు నిజమైన సహధర్మచారిణిగా వ్యవహరించారామె.

ఆయన అసలు పేరు ధనపత్ రాయ్. ప్రభుత్వోద్యోగిగా వుంటూ రచనా వ్యాసంగంకోసం 'నవాబ్ రాయ్' అనే కలం పేరు పెట్టుకున్నారు మొదట. 1909 లో ఆయన మొదటి కథల సంపుటి "సోజె వతన్" ను జప్తుచేసి, జిల్లామేజిస్ట్రేటు "ఇది బ్రిటిష ప్రభుత్వం గాబట్టి సరిపోయింది, యిదే మొగలు పాలన అయితే రాజద్రోహ నేరానికి రెండు చేతులూ నరికి పోగుపెట్టేవారు" అన్నారు. ఇకముందు ప్రభుత్వానుమతి లేనిదే రాయగూడదని ఉత్తర్విచ్చాడు. ఆనాటినుండి ప్రేమ్‌చంద్‌గా పేరు మార్చుకుని ఆయన తన రచనలు సాగించారు.

ఆయన తన మొదటి కథ "దునియాకా సబ్‌సే అన్‌మోల్ రతన్"లో ప్రపంచంలో అతి విలువైందేది? అని అడిగి "ఉరితీయబడ్డ కొడుకుకోసం ముసలితండ్రి కార్చే కన్నీరా? కాదు; భర్తచితిపై కాలి బుగ్గయిన పతివ్రత అస్తులా? కాదు; దేశ స్వాతంత్ర్య సాధనకోసం దేశ భక్తుడు కార్చే కడపటి రక్తపు బొట్టు" అంటారాయన. జాతీయోద్యమంలో అతివాది అయిన తిలక్ ప్రభావం ఆయనపై గాఢంగా పడింది, కాని ఆయన సాంఘిక తిరోగమన ధోరణిమాత్రం అంట లేదు. కనుక తన మొదటి ఉర్దూ నవల "అస్రారే మఅబిద్" (గుడుల గుట్లు) లో పూజారుల, మహంతుల గుట్లను రట్టు చేస్తారు.

1912 లో వెలువడ్డ "వరదాన్" లోనే కూలిపోతున్న పూరిగుడిసెల్లో కళ్ళల్లో ప్రాణాల్తో చిక్కి శల్యావశిష్టులైన మనుషులు, వారితో పోటీ పడుతున్న పశువులు, మానాన్ని కూడా సరిగా కప్పలేని చింకి పాతలు, పొద్దాక రెక్కలు ముక్కలు చేసుకున్నా మడత కుడుములపై బతికే గర్వ దారిద్ర్యం—నగ్నంగా చిత్రించారు. 1917 ప్రాంతంలో ప్రచురించబడ్డ "సప్తసరోజ్" లో ఆదర్శ స్వయంసంపూర్ణ గ్రామీణ వ్యవస్థకోసం ఆయన కంటున్న, పడుతున్న ఆరాటం రూపుదాల్చాయి. ఉమ్మడి కుటుంబ వ్యవస్థను పైకెత్తే "బడేఘర్‌కీ బేటీ," పంచాయితీలో పెద్దగా కూచోగానే మనసులోని కుళ్ళంతా మరచే "పంచ పరమేశ్వరులు," ముక్కుకు సూటిగా పోయి డిస్మిస్ అయిన "నమక్‌కా దరోగా" (సాల్టు ఇన్‌స్పెక్టరు) ను ఆదరించిన వ్యాపారి— మనకు వీటిల్లో దర్శనమిస్తారు. 1918 లో వెలువడిన "సేవాసదన్" లో "సాని వాడ అనే రోగ క్రిములు, అవినీతి, దగాకోరుతనం, దోపిడీలపై ఆధారపడ్డ సమాజమనే

మురుగు గుంటనుండే పుట్టాయి; ఇది నశిం చిన మరుక్షణమే అవి గాలిలో కలుస్తాయ"ని కుండ బద్దలు కొట్టినట్లు చెప్తారు. 1920 లో రౌలట్ చట్టం, మార్షల్ లా, జలియన్ వాలా బాగ్ జ్వాలా శిఖరాన వికసించిన పద్మం "ప్రేమాశ్రమ్". దోపిడీ, దౌష్ట్యాలను నిర్మూ లించి, రైతులను, కూలీలను మనుషులుగా నిలబెట్టిన రష్యా బోల్షెవిక్ సమాజంలాంటిది మన దేశంలోనూ ఏదో ఒక రూపంలో, ఏదో ఒకనాడు రాకతప్పదని యీ నవలలోని ఒక పాత్ర చెబుతుంది. 21-12-1919 న దయా నారాయణ్ నిగమ్‌కి వ్రాసిన జాబులో "బోల్షెవిక్ సిద్ధాంతాలను దాదాపుగా నే నిప్పుడు ఆమోదిస్తున్నాన"ని ప్రేమ్‌చంద్ చెప్పుకున్నారు. జమీందారీ దోపిడీ నగ్న స్వరూపాన్ని జమీందారు భార్య గాయత్రి నోటనే యిలా చెప్పిస్తారు: "ఆయన యెంత పవిత్రాత్ముడు! భిక్ష పెట్టకుండా బిచ్చగాళ్ళను యెన్నడూ పంపేవాడు కాడు. దానధర్మాలకు వేలకువేలు ఖర్చు చేసేవారు. సాధుసంత సంతర్పణ చేయకుండా ఆయన అన్నం ముట్టేవాడు కాడు గదా! కాని ఆయన కూడా రైతులపట్ల కఠినంగా వుండవలసివచ్చేది. శిస్తులు, నజరానాలు చెల్లించనివార్ని చేతులు విరిచికట్టి, కిందపడిందాకా కొట్టాల్సివచ్చేది. ఆయనే యిలా చేస్తుండగా నేను కళ్ళారా చూసేదాన్ని. అన్ని ఉపాయాలు విఫల మయ్యేక వాళ్ళ కొంపలకు నిప్పుపెట్టించే వారు. ఇప్పుడు నేనూ అదే చేయాలి." అలాగే "రంగభూమి"లోని సూరదాసు దరిద్ర నారాయణుని ప్రతినిధిగా బార్డోలీ, బీహారు నీలిమందు రైతుల తరపున నిలబడి పోరాడిన గాంధీకి ప్రతిరూపం. ఈ ఫ్యూడల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్య మే 1923 లో "ప్రస్తుతం నేనే పార్టీకి చెందను. పీడిత ప్రజలను జాగృతం చేసి, వారిని విముక్తి పోరాటంలోకి నడిపే రేపటి పార్టీకి చెందుతా న్నేను" అని ఆయనచేత చెప్పించింది, దయా నారాయణ నిగమ్‌కి రాసిన మరో జాబులో.

1921లో ఉద్యోగం వదలివేసి ప్రేమ్‌చంద్ సహాయ నిరాకరణోద్యమంలో కురికారు. ఆయన్నూరక ప్రోత్సహించడమే కాక, క్రియాశీల కార్యకర్తగా పాల్గొని స్వయంగా జైలుకెళ్ళారు శివరాణీదేవి. ఇంత కష్టకాలం లోనూ, మళ్ళీ వెనుకచూపు చూడకుండా నడిపించారామె.

ఆత్మగౌరవం, స్వాతంత్ర్యేచ్ఛ కోల్పోయి, పరాయి సామ్రాజ్యవాదుల ముందు చేతులెత్తి విలాసాలకు, వ్యసనాలకు బానిసలైన దేశీయ ఫ్యూడల్ వ్యవస్థ పతనా నికి ఎత్తిపట్టిన అద్దం "శతరంజ్ కే, ఖిలారీ" 1924 లో వెలువడింది. ఈ వ్యవస్థపట్ల ఆయనకున్న అసహ్యమే ఆల్వార్ మహా రాజా నెలకు రు. 400-00, కారు, బంగళా యిస్తానన్నా ఆయన పంచ చేరకుండా చేశాయి. అయితే రచనలతో పూటగడవక, లక్నో వెళ్ళి రు. 200-00, నెల జీతంపై "మాధురి" సంపాదకత్వం చేబట్టాల్సి వచ్చింది.

వరకట్న రాక్షసి క్రూరదంష్ట్రలకు బలై, ముసలిమొగుణ్ణి కట్టుకొని, సవతికొడుకుతో రంకుతనం అంటగట్టించుకొని విషాదాంత మైన "నిర్మల" మధ్య తరగతి జీవితాన్ని అత్యంతశక్తివంతంగా చిత్రిస్తుంది. బంగారు నగం మోజులో భర్తను మొదట అవినీతికి పాల్పడజేసినా, పోలీసు దౌష్ట్యాన్ని, కష్ట జీవుల ధీరత్వాన్ని చూచి ఉత్తేజితురాలై ప్రజోద్యమంలో కురికి పునీతురాలవుతుంది మధ్యతరగతి మహిళ జాలప "గబన్" నవలలో.

సైమన్ కమీషన్ వ్యతిరేక ప్రదర్శనలతోను, భగత్‌సింగ్, చంద్రశేఖర్ ఆజాద్‌ల అమర బలిదానంతోను, లాహోర్ కాంగ్రెసు వేదికనుండి "సోషలిజం, ప్రజాస్వామ్యం" కోసం నెహ్రూ చేసిన శంఖారావంతోను, కాన్పూరు, మీరట్ కుట్రకేసుల్లో ఖంగున మోగిన భారత కమ్యూనిస్టుల కంచు కంఠంతోను ఆసేతు హిమాచలం ఒళ్లు విరిచి లేచింది. ప్రజోద్యమం ప్రభంజన రూపం దాల్చింది. ఈ మహోద్యమ ప్రతిధ్వనులే పలికాయి "కర్మభూమి"లో. భారతగడ్డపై అవతరించారు "గోర్కీ", కాని భారత రాజకీయాకాశంపై లెనిన్ లేరు. విప్లవ పోరాట అగ్రభాగాన భారత బోల్షెవిక్ పార్టీ లేదు. ఈ బలహీనతలు కూడా ఆ నవలలో ప్రతిబింబిస్తాయి.

1930 లో ఉత్తమ సాహిత్యమాస పత్రిక "హంస" స్థాపించారు ప్రేమ్‌చంద్. అదీ, అటుతర్వాత "జాగరణ" ఆయన మూలుగులు పీల్చివేశాయి. ఆర్థికంగా ఆయన నడ్డి విరిగింది. సినిమారంగమనే మృగతృష్ణ వెంట బడి బొంబాయి వెళ్లారు. కాని ఆ కృత్రిమ, కిరాయి వ్యాపార వాతావరణలో యిమడలేక యేడాది తిరక్కముందే బయటపడ్డారు. ఆయన సంభాషణలు రాసిన "మజ్దూరు" సినిమా ప్రదర్శనను నిషేధించింది బ్రిటిష ప్రభుత్వం. ప్రజల బలహీనతలపై సొమ్ము జేసుకోవాలనే ఫార్ములా చిత్రాల బాణీకి ఆయన వాణి సరిపడలేదు.

లండన్ నుండి వచ్చిన అభ్యుదయ రచయితల సంఘ ప్రణాళిక నవ భారత సాహిత్యానికి ఆశాకిరణం, వైతాళిక గీతి అని కీర్తించారు ప్రేమ్‌చంద్. శ్రమ జీవుల జీవన సమరంలో అత్యున్నత సౌందర్యాన్ని దర్శించగలదే ఉత్తమ సాహిత్యమని లక్నోలో జరిగిన అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘ అధ్యక్షపీఠం నుండి ఉద్ఘోషించా రాయన.

తన చరమ ఘడియల్లో, అతి భయానకమైన రక్తపిపాసువుగా తయారైన వ్యాధ

## ఏమని యాచించను?

**ఎస్.జి.డి చంద్రశేఖర్**

ఆకలేసే నాకు
ఏడు పెక్కువైంది
ఏడ్చి ఏడ్చి నాకు
కన్నీ రాగిపోయింది
ఆకలేసే కడుపుతో
కన్నీరింకి పోయిన
ముఖంతో ఎవరిని
యాచించను?
ఏమని యాచించను?
మట్టినుంచి మానవుణ్ణి
చేసే ఆ దేవుణ్ణి
యాచించనా?
మానవుల్ని పురుగుల్లా
చూచే ఈ నరుల్ని
యాచించనా?
ఎవరిని యాచించను?
ఏమని యాచించను?
కళ్ళూ కాళ్లూ ఇచ్చిన
ఓదేవా! కడుపు నిండే
మార్గం చూపమని
యాచించనా?
కాలు కదిలించేందుకు
చేయి ఆడించేందుకు
శక్తి నిమ్మని
యాచించనా?
నా కాలూ, చేయీ
నా యీ కుడిపార్శ్వం
అంతా చక్కగా ఉంటే
ఇలా ఆకలితో ఏడ్వడం
నా కెందుకు?
ఈ ప్రపంచాన్నే
చక్రవర్తినై
ఏలుందునా?
నా కీ పక్షవాతమే
తీరని ఒక శాపం
నా ఈ ఆవేదనే
నాలోని ఆకలీ దాహం
అందుకే నేను
ఏమని యాచించను?
ఎవరిని యాచించను?

లిజాన్ని, సామ్రాజ్యవాద ఛత్రఛాయల్లో భారత జనసామాన్యం మూలుగుల్ని పీల్చ డానికి రాక్షసి అంగల్తో ముందుకొస్తున్న పెట్టు బడిదారీ విధానాన్ని నగ్నంగా చీల్చి ఎండగట్టిన నవల ''గోదాన్''. ఈ దోపిడీ వ్యవస్థ పద ఘట్టనలో నుగ్గి నూచ అవుతూ, తిరగబడు తున్న కార్మిక, కర్షక, మధ్యతరగతి ప్రజలు యిందు మన కెదురవుతారు. ఆర్థిక దోపిడీకి తోడు అస్పృశ్యతకు గురవుతూ అప్పు డప్పుడే తల ఎత్తుతున్న ''అంటరానివాళ్ళ'' ప్రతిఘటన మన కళ్ళముందుకొస్తుంది. సహ స్రాబ్దాల దోపిడీ, దారిద్ర్యాల భారంతో కృంగి పోతూ కూడా, తనదైన సహజ విశిష్టతను విడనాడని భారతీయ పేద రైతుగా మన ముందు నిలుస్తాడు హోరీ. తాత్కాలికంగా ఓటమి పాలైనా, యినుమడించిన శక్తితో తల యెత్తనున్న భావి భారత ప్రజోద్యమాల అరుణ రేఖల్ని ఈ నవలలో మనం దర్శిస్తాం. ''కఫన్'', ''పూస్ కీ రాత్'' కథల్లో కూలి పోతున్న దోపిడీ వ్యవస్థ నగ్న స్వరూపం, యీ వ్యవస్థ కారణంగా మనిషిలో వస్తూన్న "వైముఖ్యం'' కన్నులకు కట్టినట్టుగా చిత్రించ బడ్డాయి.

ఆయన అంతిమ రచనలు ''మహాజనీ సభ్యత" (ధనస్వామ్య నాగరికత), 'మంగళ సూత్రం' అనే అసంపూర్ణ నవలల్లో భార తీయ పీడిత జనత నిజపరిస్థితుల సూక్ష్మ అవగాహనయే గాక, దాని పరిష్కారాని కవ సరమయిన శాస్త్రీయ విప్లవ సిద్ధాంత స్పష్టత కూడా మనకు గోచరిస్తుంది. ఇలా ఆదర్శో న్ముఖ యధార్థవాదం నుండి సోషలిస్టు వాస్త వికతలోకి పరిపూర్ణ పరిణతి చెందుతున్న యీ దశలో, 56వ యేటనే ప్రేమ్‌చంద్ అకాలమరణం పాలవడం హిందీ సాహిత్యా నికి, భారతీయసాహిత్యానికే గాక, ప్రపంచ అభ్యుదయోద్యమానికే తీరని నష్టం.

భారత దేశపు మహా కళాకారులయిన రవీంద్రుడు, శరత్ బాబులలో కానరాని గ్రామీణ ఉత్పత్తి సంబంధాల, పోరాటాల కళాత్మక చిత్రణ ప్రేమ్‌చంద్ రచనల్లో మనకు కన్పిస్తుంది. బెంగాలీ నవలా సాహి త్యంలో కోమలత్వం, హృదయాన్ని కది లించి, కవ్వించే కళా చాతుర్యం చాల ఎక్కు వగా వుండవచ్చునేమోగాని, ప్రేమ్‌చంద్ లోని నవజీవన నిర్మాణ సమర శంఖారావం లేదేమో! "అందుకే బెంగాలీ సాహిత్యంలోని స్త్రీత్వం, మృదుత్వం నాలో లేవు. రవి, శరత్‌లవలె రాయను, రాయలేను" అన్నా రాయన. తలవంచుకుని, తమకు జరిగే అన్యాయాలన్నీ సహించే మూగ జీవాలుకా వాయన పాత్రలు. తమకు తోచిన రీతిలో ''దారి పొడుగునా గుండె నెత్తురులు తర్పణ చేస్తూ" ముందుకు, ముమ్ముందుకు త్రోసుకు పోతున్న విప్లవ సమరయోధులు వారు.

మత మౌఢ్యానికి, భాషా దురహంకారా నికి ఎదురొడ్డి సవ్యసాచివలె హిందీ, ఉర్దూ— రెండు భాషలలోను సమ ఉజ్జీగా సాహిత్య రచన చేసిన వా రాయన. హిందూ-ముస్లిం సఖ్యత కొరకు తన సర్వశక్తుల్ని వొడ్డిన వా రాయన. జాతీయోద్యమంలో అంతర్వాహి నిగా బయలుదేరి విప్లవ ప్రజాతంత్ర ఉద్య మాల వైతాళికుడుగా రూపు దిద్దుకొన్నవా డాయన. జాతీయోద్యమానికి, కమ్యూనిస్టు ఉద్యమానికి స్వతస్సిద్ధమైన వారధి ఆయన. సందేహవాదం నుండి, శాస్త్రీయ భౌతికవాదా నికి పయనించిన ప్రగతిశీలి ఆయన.

వెనుక చూపన్నది లేక, నిరంతర ప్రగతి శీలిగా నిబద్ధత, నిమగ్నతలను సమపాళ్ళలో మేళవించి, పోరాడుతూ నేల కొరిగిన మహాయోధుడు ప్రేమ్‌చంద్.

# ఒక చేత కత్తి,
# ఇంకో చేత కలమూ

జీవితాన్ని అందరం ప్రేమిస్తాం; సౌంద ర్యాన్ని అందరం ఆరాధిస్తాం. ఇది ప్రాణు లన్నిటికీ వుండే లక్షణమే. కాని, సామా న్యుల విషయంలో యిది ప్రాణాలమీద తీపి దగ్గర ఆగిపోతుంది. జీవితాన్ని, సౌంద ర్యాన్నీ ప్రేమించటం, ఆరాధించటమూనే గాక, వాటిని అభావం చేసే దేనిపైనైనా సరే ప్రాణాలు సైతం లెక్కపెట్టకుండా పోరాడే వాడు నిజమైన విప్లవకారు డనిపించుకుంటాడు. జీవితాన్నీ, సౌందర్యాన్నీ, మానవ నాగరకత వేల సంవత్సరాలుగా పెంపు చేసిన ప్రతి ఒక్క విలువనూ తుడిచిపెట్టేందుకు పాల్పడిన ఫాసిజంపై ఒక చేత కత్తీ, మరో చేత కలమూ పట్టి, చివరకంటా పోరాడి, జీవితం చిరకాలం వర్ధిల్లాలి అని బిగ్గరగా నినదిస్తూ ఆ పోరాటంలో నేలకొరిగిన చెకొస్లొవాకియా కమ్యూనిస్టు నాయకుడూ, విప్లవ సాహితీకా రుడూ అయిన జ్యూలియస్ ఫ్యూజిక్ అలాంటి విప్లవకారుల్లో అగ్రగణ్యుడు. ఫాసిస్టు మృత్యు గహ్వరంలో నుంచి ఆ వీరుడు తన అంతిమ గడియల్లో మానవజాతి కిచ్చిన తుది సందే శమే, తన ఉద్యమ వారసుల కందజేసిన తన మరణ శాసనమే 'రక్తాక్షరాలు (Notes from the Gallows. ఆంధ్రీకరణ: శ్రీ అనిసెట్టి సుబ్బారావు) అన్న రచన.

చెకొస్లొవాకియాను ఆక్రమించిన హిట్లర్ ఫాసిస్టు మూకలు ఫ్యూజిక్‌ను 1942 ఏప్రిల్ 24 న ప్రాగ్‌లో అరెస్టుచేసి, నరకాన్ని తల పింపజేసే పాంక్రాస్ జైల్‌లో నిర్బంధిం చాయి. నాజీలు ఆయన్నూ, ఆయనతోటి విప్లవకారులనూ ప్రతిరోజూ పెచెక్ భవనం లోని పోలీసు కార్యాలయానికి లాక్కువెళ్ళి చిత్రహింసలుపెట్టి దర్యాప్తు తతంగం సాగి స్తుండేవాళ్ళు. ఆయన మొత్తం 411 రోజుల పాటు పాంక్రాస్ జైల్‌లోనూ, పెచెక్ భవనంలోనూ నరకయాతన లనుభవించాడు. ఆ తరువాత నాజీలు ఆయన్ను బెర్లిన్‌కు తరలించి 1943 సెప్టెంబరు 8 న ఉరితీశారు. ఆయన పాంక్రాస్ జైల్‌లో వున్న రోజుల్లో, సాహసవంతుడైన ఒక చెక్ కావలాదారు, అడాల్ఫ్ కొలిన్‌స్కీ అనే అతడి సహా యంతో రాత పరికరాలు సంపాదించి, మృత్యుముఖంలో తన అనుభవాలను అక్షర రూపంలో పెట్టారు. "మహత్తర విప్లవ చైతన్యంతో, కావాలని నాజీల కొలువులో చేరి, వాళ్ళ ఉద్యోగం చేస్తూ, వాళ్ళను నాశనం చేసేందుకు పోరాడిన విప్లవకారుల్లో" ఈ కొలిన్‌స్కీ ఒకరు. ఆయన ఫ్యూజిక్ రాసిన కాగితాలన్నిటినీ పదిలంగా జైలు బయటకు దాటించి, హిట్లర్ పతనానంతరం, 1945 లో నాజీ నిర్బంధంనుంచి బ్రతికి బైట పడ్డ వీరనారి అగస్తినా ఫ్యూజిక్‌కు అంద జేశారు. ఫ్యూజిక్ విప్లవ జీవితంలోని, విప్లవ రచనా వ్యాసంగంలోని "తుది అధ్యాయం" అనదగిన తన భర్త రచనను ఆమె ప్రపంచ విప్లవోద్యమానికి కానుకగా అందజేశారు.

ఫ్యూజిక్ విప్లవ తత్వానికి, విప్లవ బోధ లకు, విప్లవానుభవాలకు ఈ పుస్తకంలోని కొన్ని మచ్చుతునకలను ఉటంకిస్తాను.

నిజమైన విప్లవ తత్వం అంటే, మానవ జాతి భవిష్యత్తుపట్ల అచంచల విశ్వాసం అనేందుకు ఆయన పాంక్రాస్ జైల్‌లోనూ, పెచెక్ భవనంలోనూ చిత్రహింసలు అనుభ విస్తూ రాసిన కింది మాటలు ప్రత్యక్ష నిదర్శనం:

''ఇలాగా కొన్ని వందలసార్లు నా జీవిత చిత్రాన్ని చూచుకొన్నాను. వేలకొలది విశేషాలు కనిపిస్తున్నాయి. ఇప్పుడు వాటిని కాగితం మీద పెట్టేందుకు ప్రయత్నిస్తాను. ఈలోపే నాజీల ఉరి ఉచ్చు నా కంఠానికి గిగుసుకొంటే బైటనున్న కోట్లకొలది ప్రజలు దానికి చరమాంకం రాసి నా ప్రయత్నాన్ని 'సుఖాంతం' చేస్తారు. ఆ విశ్వాసం నాకుంది.''

* * *

పెచెక్ భవనంలో నాజీలు ఆయన్ను చిత్రహింసలు పెడుతూ, విరామ కాలంలో ఒక నర్సును పిలిపించి వైద్యోపచారాలు చేయించటం అనవాయితీగా వుండేది. ఒకసారి ఆ నర్సు ఆయన్ను బాధ ఎక్కువగా ఎక్కడుందో చెప్పమని అడిగింది. ''హృదయంలో'' అని ఫ్యూజిక్ జవాబిచ్చారు. ''నీకు హృదయం కూడా వుందా?'' అని ప్రక్కనే వున్న ఒక నాజీ అధికారి ఆయన్ను వెక్కిరించాడు. ''ఉంది'' అని ఫ్యూజిక్ గట్టిగా అరిచాడు. వాళ్ళకు లొంగకుండా తన ఆత్మ గౌరవాన్ని కాపాడుకోగలిగినందుకు, తన హృదయం గర్వంతో నిండిపోయిందని ఆయన ఈ అనుభవాల్లో ఒకచోట రాసుకొన్నారు.

* * *

జైలు ఒక సూక్ష్మ ప్రపంచం. మనం చిరకాలంగా ఎరిగిన వ్యక్తుల గురించి కూడా మనకు తెలియని అనేక విషయాలు జైలు జీవితంలో మనకు అవగతం అవుతాయి. వాళ్ళని 'క్లోజప్'లో చూడగలుగుతాం. తాను అలా క్లోజప్‌లో చూచిన అనేక మంది మనుషుల్నీ, మనుష్యాకారంలో తిరిగే మృగాల్నీ కూడా ఫ్యూజిక్ ఈ రచనలో చిత్రించారు.

జైలు జీవితం తెచ్చిపెట్టే అసహాయ స్థితి సమానాదర్శాలు గలవారిని, బైటి జీవితంలో కన్నా అనేక రెట్లు ఎక్కువ సన్నిహితం చేస్తుంది.

ఫ్యూజిక్‌తోటి ఖైదీ ఒకడు, ప్రాణాపాయానికి సైతం తెగించి ఒక మల్లెపూవునూ, రెండు పచ్చని గడ్డి పరకలనూ సంపాదించి అతడికి గౌరవ పూర్వకంగా కానుక యిస్తాడు. రోజూ రొట్టెలు పంచే స్కా-రెస్కా అనే తోటి ఖైదీ మే దినోత్సవం నాడు ఫ్యూజిక్‌కు అదనంగా మరో రొట్టె యిస్తూ, వార్డర్ కంటపడకుండా అతడి వ్రేళ్ళను ప్రేమపూర్వకంగా తాకుతాడు. వాళ్ళు మాట్లాడుకొనేందుకు వీల్లేదు. శత్రువు తమ చూపుల్ని సైతం కాపలా.

---

### చందాదారులకు విజ్ఞప్తి

పధ్నాలుగు నెలల బులిటిన్‌గా వచ్చి, 'అభ్యుదయ' ఆగస్టు నెలనుండీ సమగ్ర మాస పత్రికగా వెలువడుతున్నది. అప్పటినుండీ సంవత్సర చందా ఏడు రూపాయలు. ఇంతకు పూర్వం, యిప్పటి చందాకు తక్కువగా పైకం పంపిన వారికి, మిగతా పైకానికి సరిపడేలాగ ప్రతులు పంపబడగలవని మనవి చేస్తున్నాము. చందాదారులు ఇప్పటి చందా రేటు ప్రకారం చందా పంపవలసిందనీ, తమ మిత్రులను చందాదారులుగా చేర్పించమనీ కోరుతున్నాము.

---

### 'అభ్యుదయ' పాత ప్రతులు

'అభ్యుదయ' పాత ప్రతులకోసం మాకు చాలా ఉత్తరాలు వస్తున్నాయి. కాని కొన్ని సంచికలవి కొద్ది ప్రతులు మాత్రమే మా దగ్గర మిగిలాయి. కాబట్టి, పంపడానికి వీలు పడదు. 'అభ్యుదయ' పాఠకులు, చందాదారులు తమ పాత ప్రతులను మాకు పంపగలిగితే, కొందరికైనా, వాటిని యివ్వడానికి వీలవుతుందని మనవి.

కాస్తున్నస్థితిలో ఆ కామ్రేడ్ ఫ్యూజిక్‌కు మే దినోత్సవ శుభాకాంక్ష లందజేసిన పద్ధతి అది. ఇద్దరు ఖైదీల్ని—అందునా కమ్యూనిస్టుల్ని—ఒకచోట చేరనిచ్చామో, ఐదు నిముషాల్లో వాళ్లు ఒక సంస్థగా తయారై కూర్చుంటారని పాసిస్టులకు గుండె బెదురు వుండటం సహజమే అంటారు ఫ్యూజిక్.

* * *

జెలినిక్స్ దంపతులు నిరుపేదలు. అతడు ఏదో ఫ్యాక్టరీలో కూలిపని చేసేవాడు. ఆమె కలవారియిండ్లలో పాచిపనిచేసి బ్రతికేది. వాళ్ళిద్దర్నీ నాజీలు ఫ్యూజిక్‌తోపాటే అరెస్టు చేశారు. వాళ్ళకు విప్లవకారుల సంగతులెన్నో తెలుసు. కాని నాజీలు ఎన్ని హింసలుపెట్టినా, వాళ్ళచేత ఒక్క ముక్కగూడా చెప్పించలేక వాళ్ళిద్దర్నీ కాల్చేశారు. "నా దుర్గతి చూచి ఎవరూ బాధపడకూడదని కోరుతున్నాను. కార్మికస్త్రీగా నా విధి నిర్వహించాను; విధి నిర్వహణలో మరణిస్తున్నాను" అని ఆమె ఫ్యూజిక్‌కు ఒక చీటి రాసి పంపింది.

ఇక ఫాసిస్టు మృగాల సంగతి: నాజీ కారుల ఆదర్శరాహిత్యాన్ని, మేకపోతు భీర్యాన్ని గురించి చెబుతూ ఫ్యూజిక్ "... ఆజ్ఞాపత్రాలు, మారణాయుధాలు అడ్డు కొని తమ ఆందోళనను మరుగుపుచ్చు టున్న అల్పులు. వాళ్ళ నాళాల్లో ప్రవ చేది రక్తం కాదు—పులుసు నీళ్లు, ... రాళ్ళతో కొనుక్కునే పులుసు నీళ్లు" అనా

* * *

తోటి విప్లవకారుల నుద్దేశించి ... 'నా వాఙ్మూలం' అన్న లేఖలో ఫ్యూ యిలా అన్నారు: "కృషికర్త చనిపో కృషి ఫలితం యిస్తుంది.... మే మి (తానూ, తన భార్య అగస్తినా) జీవన గ్యం కోసం బ్రతికాం; దానికో పోరాడాం; దానికోసమే మరణిస్తున ఎప్పుడుకూడా, మా పేర్లకూ, దుః పొత్తు కలపవద్దు." ధన్యజీవి అయిన కారుడు మాత్రమే ఈ మాట లనగలడ

(టి. ...

## నిష్పాక్షిక సినీమా సమీక్షలు రాకపోవడానికి కారణం

"ఊరుమ్మడి బ్రతుకులు" ఉత్తమ ప్రాంతీయ భాషా చిత్రంగా జాతీయ స్థాయి... అవార్డు పొందిన సందర్భంగా, ఆర్ట్ ఎంటర్ ప్రైజెస్ ఇటీవల విజయవాడలో పా... కేయులతో ఇష్టాగోష్ఠి జరిపింది.

ఈ చిత్ర దర్శకుడు శ్రీ బి. ఎస్. నారాయణ మాట్లాడుతూ సినిమా సమీక్ష నిష్పాక్షికంగా, మార్గదర్శకంగా, నిర్మాణాత్మకంగా వుండాలని పత్రికా విలేఖరుల... కోరిన మీదట 'ఆంధ్ర జ్యోతి' దినపత్రిక సంపాదకుడు శ్రీ నండూరి రామమోహ... రావు మాట్లాడుతూ, సినిమా సమీక్షలను నిష్పాక్షికంగా, మార్గదర్శకంగా, నిర... ణాత్మకంగా వ్రాయడంలో విలేఖరులు వెనుకాడరని, అలా రాయాలనే అభిలషిస్తార... కాని వున్నది వున్నట్టు రాస్తే, నిర్మాతలు సహించజాలరని, ఫలితంగా పత్రికల అడ్వర్‌టైజ్‌మెంట్స్ ఆపివేస్తున్నారని, ఈ పరిస్థితిలో వున్నది వున్నట్టు వ్రా... వలసిన పని ఏమున్నదని ప్రశ్నించారు. పత్రికలు, నిర్మాతలు ఒక విధమైన అవినీ... (కరప్షన్) లో పడి కొట్టుకుంటున్నారని అన్నారు.

# నేటి కవిత్వ ప్రయోజనం

ఆంధ్ర ప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ అగస్టు 7 వ తేదీని, పొట్టి శ్రీరాములు స్మారక మందిరంలో నిర్వహించిన కవితా గోష్ఠిలో 13 మంది కవులు తమ స్వీయ కవితలను వినిపించారు. (వీటిలో కొన్నింటిని, ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.) కవితా గోష్ఠిలో శ్రీయుతులు చామర్తి దుర్గాప్రసాద్, డాక్టర్ దాశరథి, శ్రీకాంత్, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, ఏల్చూరి మురళీధర రావు, పద్మపాణి, కృష్ణానంద కుమార్, గంధం అప్పారావు, వై. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి, వి. సుబ్బయ్య, ప్రసన్న కుమార్, పసుపులేటి రామారావు, శ్రీమతి హేమలత అంజనేయులు పాల్గొన్నారు. (మొదటి యిరువురు కవితలు పంపారు. చివరి వారు హిందీ కవిత చదివారు.) కవితా గోష్ఠి అనంతరం నేటి కవిత్వ ప్రయోజనం గురించి చర్చ జరిగింది.

సభాధ్యక్షులు శ్రీ డి. వి. నరసరాజు చర్చను ప్రారంభిస్తూ, "నేటి కవిత్వాని కున్న ప్రయోజన మేమిటి? ఈ కవిత్వంవల్ల కలుగుతున్న మార్పేమిటి? ఏమార్పూ లేదని నా అభిప్రాయం. ప్రజల కోసం, ప్రజల పేరుతో, ప్రజల మీద యిప్పుడు జరుగు తూన్నంత 'ఫ్రాడ్' ఎన్నడూ జరగలేదు. ప్రజలను దోచుకున్నవారు ప్రజల మేలు కోసమే పనిచేస్తున్నామని ఎవరూ లోగడ చెప్పలేదు. ఇప్పుడు చెబుతున్నారు. ఇదే పెద్ద ఫ్రాడ్. నేటి కవులు ప్రజలను కథావస్తువుగా స్వీకరిస్తున్నారు తప్ప, ప్రజల కోసం రాయడం లేదు. మన దేశంలో అక్షరాస్యు లెంతమంది? వీళ్ళలో కవిత్వం చదివే వాళ్ళెంత మంది? కవులు అనిపించుకొనడానికి కొంత గుర్తింపు కావాలి. ఈ గుర్తింపు సాటి కవులనుండే వస్తుంది గాని ప్రజలనుండి గాదు. భావ కవిత్వం రోజుల్లో రాసిన కవిత్వాలన్నీ, వాటిని విన్న కవులు పరస్పరం పొగుడుకొనడానికే పరిమిత మయ్యాయి. నేడూ అంతే" అని అన్నారు.

శ్రీ పసుపులేటి రామారావు మాట్లాడుతూ కవిత్వం వల్ల ప్రజలకు ఉపయోగం జరుగుతూ వుందని, అట్టడుగు ప్రజలలో కొంత చైతన్యం కలగడానికి అభ్యుదయ సాహిత్యం సాధనమైందనీ, చదవలేనివారికి గూడా సినిమాలు, నాటకాలు మున్నగు వాటివల్ల కొంత చైతన్యం రాలేదని చెప్పడానికి వీల్లేదనీ అన్నారు.

శ్రీ వి. సుబ్బయ్య: కవిత్వం రాజాస్థానాల నుండి సామాన్యుల బ్రతుకులకు చేరువగా వచ్చిందనీ యిది అభిలషణీయమైన విషయమనీ చెప్పారు.

శ్రీ డి. అంజనేయులు: వచనంలో చెప్పలేని అందాలను కవితలో చెప్పగలగాలి. నా దృష్టిలో ఈ గోష్ఠిలో చదివిన కవితలకు వేటికీ, కవితకు ఉండవలసిన ప్రమాణాలు లేవు.

శ్రీ జి. వి. జీవి: సాహిత్యం వల్ల విప్లవాలు రాకపోవచ్చు. కానీ సాహిత్యం అనేది సాంస్కృతిక సైన్యంగా విప్లవాలకు తోడ్పడింది. విప్లవ కవులు ప్రజలకు అర్థ మయ్యే రీతిలో కవితలు వ్రాశారు, ప్రజల మధ్యకు తీసుకవెళ్ళడానికి ప్రయత్నించారు. ప్రజా నాట్యమండలి సామాన్య జనాన్ని చాలా ప్రభావితం చేసింది. సామాజిక జీవితాన్ని ప్రతిబింబించే రచనలకు మాత్రమే ఈ వేదికపై స్థానం వుండాలి.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి: కవిత్వానికి గానీ, రచనలకు గానీ ప్రయోజనం వుందన్న విషయం అధ్యక్షులకు తెలుసు. ఈ గోష్ఠిలో చదివిన కవితలు చాలా వరకూ బాగా వున్నాయి. అభ్యుదయ దృక్పథం కలిగింది మాత్రమే కవిత అని నేను భావించడం లేదు. ప్రతి కవీ ఏదో ఒక ప్రయోజనం ఆశించే కవిత రాస్తాడు. అలాగని ప్రతి కవితలోనూ తప్పనిసరిగా ప్రయోజనం వుండాలనుకొనడం పొరపాటు. మహారాజుల కాలంలో కవిత వారి స్వీయ మానసికానందం కోసమే రాయబడింది. ఆనాడు ప్రజల కోసం రాయలేదు. అలా రాసినవారు ఎవరైనా వుంటే వారు యిప్పటికే మనకు మార్గదర్శకులయ్యారు. గురజాడ అప్పారావు దేశభక్తి గీతాన్ని ప్రజా నాట్యమండలి ప్రజల మధ్యకు తీసుకెళ్ళి దేశానికి తెలియజెప్పింది. వీరేశలింగం గారి సంఘ సంస్కరణ కృషిని ఒక బుర్రకథ ద్వారా సామాన్య ప్రజానీకంలోకి తీసుకెళ్ళడం జరిగింది. అలాగే అల్లూరి సీతా రామరాజును మాంత్రికుడుగానో, తాంత్రికుడుగానో ప్రజలు చెప్పుకునే రోజుల్లో ఆయన విప్లవ పోరాటాన్ని ప్రజలకు అందించ గలిగింది ప్రజా నాట్యమండలి. ద్వితీయ ప్రపంచ యుద్ధం, తెలంగాణా పరిస్థితులు. జమీందారీ సమస్యల నన్నింటినీ, నాటకాలుగా, బుర్రకథలుగా, గేయాలుగా అభ్యుదయ రచయితలు రాస్తే, వాటిని లక్షోప లక్షల ప్రజల్లోకి తీసుకెళ్ళింది ప్రజా నాట్యమండలి. ప్రాచీన కళారూపాలను ప్రజా సమస్యలతో జోడించి వాటికి ప్రాచుర్యం కలిగించిన ఖ్యాతి అభ్యుదయ రచయితల సంఘానికీ, ప్రజా నాట్యమండలికీ వుంది.

సెట్టి ఈశ్వర రావు: ప్రజాసాహిత్యానికీ, మధ్యతరగతి సాహిత్యానికీ తేడావుంది. అది గమనించాలి. భౌతిక పరిస్థితులు లేనప్పుడు సమరశీల సాహిత్యం రాదు. వచ్చినా అది కదలిక తీసుకరాలేదు.

బి. సూర్యా రావు: సాహిత్య ప్రభావం లేకుండా పోదు. ఏ సాహిత్యానికైనా ప్రచారం, దానికి అనువైన భౌతిక పరిస్థితులూ కావాలి.

ఈ చర్చానంతరం అధ్యక్షులు చర్చను సమీక్షిస్తూ, "సాహిత్యానికి ప్రయోజనం లేదని నా ఉద్దేశ్యం కాదు. సాహిత్యానికి ప్రచారం కావాలి. ప్రచార సాధనాలు కావాలి. ఉద్యమాలు కావాలి. నేడు అవి లోపించాయి. సాహిత్య రంగంలో నైతిక ప్రమాణాలు రోజు రోజుకూ దిగజారిపోతున్నాయి. నేడు రచయితలలో చిత్తశుద్ధి లోపించింది. ప్రజలతో సజీవ సంబంధం లోపించింది. కార్మికుల జీవితం ఎలా వుంటుందో యెరుగని మధ్యతరగతి రచయితలు కార్మికుల జీవితం గురించి రాస్తే, అది వారి నిజ జీవితాన్ని ప్రతిబింబించదు. కవి అయినవాడు, ప్రజలలో ఒకడుగా, వారి దైనందిన జీవితంలో పాలుపంచుకుంటూ, వారి జీవితాన్ని చూస్తూ, అనుభవిస్తూ రాయాలి. ఒక్క రాయడంతోనే సరిపోదు. దానిని ప్రజల్లోకి తీసుకెళ్ళడానికి ఒక ఉద్యమం గావాలి, అప్పుడే సాహిత్యం నిలుస్తుంది. సాహిత్య ప్రయోజనం సిద్ధిస్తుంది" అని చెప్పారు.

1974 రైల్వే సమ్మెను 'సృజన' పత్రిక సంపాదకీయంలో బలపరిచిందనే కారణంతో ఆ పత్రిక ప్రచురణకర్త శ్రీమతి హేమలతకు రాజద్రోహ నేరం కింద విధించిన శిక్షను, మారిన రాజకీయ పరిస్థితులలో రద్దుచేసి, ఆమెను విడుదల చేయాలని కోరుతూ ఈ సమావేశం, ప్రారంభంలో ఏకగ్రీవంగా తీర్మానించింది.

# కవితా పఠనంలో చదివిన కొన్ని గీతాలు

మినుకు అరువు తెచ్చుకుని
మింట వ్రేలాడే
వేల తారకలు వేడుక
చూస్తుంటే
వెన్నెల మంటల్లో
చచ్చిపోయిన చందమామ
చల్లగా కాలి పోతున్నాడు!
పనుల్లేని పెద్ద మనుషులు
కవులూ ప్రేమికులూ
పరవశించి పోతున్నారు!!
నింగి వంకైనా చూడకుండా
కంగారు పడుతున్నాడు
చిరకాల చిరుద్యోగి
చిలకల గంగాధరం!
నెల జీతం వయసు
పది రోజులే అయినా!
తుది ఊపిరి పీలుస్తోంది!
ఇరవై రోజుల శాపం
ఇప్పట్నించీ పీడిస్తోంది!
బహుసంతాని కాడు

## * చిరుద్యోగి స్వగతం *

*టి. ప్రసన్నకుమారి*

బజారు వేషాలెయ్యడు
బ్రతుకు మాత్రం
భారంగానే గడుస్తోంది!
బియ్యేదాకా చదివినా
పొయ్యే కాలమేమో గానీ
కడుపు నిండే చోట
కళాశాల చదువుకీ
కలం తీసే పరుగుకీ
పొత్తు కుదరక
ప్రతి పొద్దూ చిరాకే!
చేస్తున్న ఉద్యోగానికి
చేతనున్న డిగ్రీ ఎక్కువ
అందుకుంటున్న ప్రతిఫలం
అవసరాలకు కూడా తక్కువ!
పటం కట్టి
గోడకు కొట్టిన చదువు
పస్తు తప్పని
గుమస్తా గిరికి పెట్టుబడి!
పరాయి ప్రభుత పోయింది
కిరాయి బ్రతుకలాగే ఉంది.
అందుకే అతగాడికి
ఆలోచించే ఓపికున్నప్పుడు
ఆవేశపడి అంటాడు
"మంత్రి మారితే
మారిపొయ్యే చదువుల్లారా
మిథ్యా విలువల
విద్యా సంస్థల్లో
ఎంత కాలం మగ్గుతారు?
పొట్టనింపని పట్టాల్లారా
బ్రతుకు తెరువుకు అతకరు
నవుకరు పనికిఎక్కువౌతారు
ఎందుకు మీరు?
అంతా కలసి చావండి
అమృతం తాగి లేవండి
తరం మారుతోంది
మీ తరహా మార్చండి"!

## * నిజం *

*వై. వి. ఎస్. ఎస్. ఎన్. మూర్తి*

సూర్యుడు తూర్పున
ఉదయించడం
చంద్రుడు రాత్రి
ఉదయించడం
సృష్ట్యాది నుండీ నిజం
తరతరాలుగా
మనుష్యుల్లో
కరుడుకట్టిన
స్వార్థం
బుసలు కొట్టడం నిజం
ఈర్ష్య-ద్వేషం-లోభం
మానవుల
ఊపిరన్నది నిజం
యుగ యుగాలుగా
చిన్న చేపను
పెద్ద చేప
మ్రింగడం
బలిమి - కలిమి
బలహీనతని - లేమిని
పాతెయ్యడం నిజం
ఎన్నెన్నో
ఇజాల మధ్య
నిజాల మధ్య
నగ్నంగా
కంటికి
కనిపించేదేదీ
నిజం
కానట్లు
భ్రమలో
బ్రతకడం
నిజం!

## * ప్రార్థనా గీతం *

చామర్తి దుర్గాప్రసాద్

మట్టి కూజా మట్టి గ్లాసూ మాయమయినై
తూర్పు నెత్తురు చిమ్ముతోంది
ఆ రోజు ప్రొద్దున,—
చెత్త కుండీలోంచి కుక్క లాగిన విస్తరి
అష్ట వంకరలు తిరిగి శ్వాస విడిచిన
టూత్ పేస్టు ట్యూబు
పులిపంజాలో మేక అరుపు - నిశ్శబ్దం
ఆ రాత్రి—
మేక కాలికింద మెత్తగా నలిగిన పులినం
ఆ క్రితం రోజు - అలా ఎన్ని రోజులో
మూడు రాళ్ళ మొనల మీద మూకుడు
సముద్రంలో కాకి రెట్టలా
మనిషి గుండెలా
కంద దుంప
రాళ్ళకడుగున ఆకాశం
నీళ్ళు తీసేసిన సముద్రంలా కడుపు
అమ్మా! అమ్మా!
బక్కెట్‌తో నీళ్ళు
పుస్తకం పేజీల మధ్య నలిగిన ఫాసిల్
అణగారిన ఆకులు పందలు, వేలు
చీమలబారు
నిరాశ చెలరేపిన గాలిదుమారం
కళ్ళల్లో మంటలు, చిందర వందర
చెల్లాచెదరు
అడవి నిండా లాఠీల చెట్లు
రాలిపోయిన ఆకు గర గర
నాన్నా! నాన్నా!
కట్టుకోవడానికి చివరిసారిగా చీకటి
ఎముకలు పరచిన అస్థిపంజరం మీద
ఇనప చువ్వలు
నరకంలోకి నేరుగా లాక్కుని పోతూ
పట్టాల మూలుగు
చీకటిలో దూరంగా ఆకుపచ్చని దీపం
నాదంగా, నినదంగా, ఉన్మాదంగా, దద్దరిల్లుత
భీకరంగా కదిలి వస్తున్న మట్టిముద్దలు
నన్ను పట్టించుకోని నరనరీమణులు
వొడ్డున వంగిన దుంగ మీద దూకుతూ
లావా కొండలు
చెక్కపడిన చప్పుడు
కల్లోలం అడుగు తొక్కిన కస కస
కాలికింద పాము, నిప్పంటుకున్న సముద్రం
ప్రార్థన
ఆ దృశ్యాలు అబద్ధాలనకు
అలాంటివి మరి జరగనని మాట ఇవ్వు
ఎందుకంత తొందర అంటావా?
తూర్పున నెత్తురు చిమ్ముతోంది కనక
ప్రతిక్షణం మళ్ళీ నేను పుట్టున్నాను కనుక
తెల్లవారుతోంది కనుక
ఆ తర్వాత
దీపం వత్తిలా వెళ్ళిపోతాను కనక! *

* "కొద్ది క్షణాలు - తెల్లవారిన తర్వాత దీపం వత్తిలా వెళ్ళిపోతాను—ఇక్బాల్"

ఉరి తీసే ముందు మట్టి కూజా తీసేస్తారు తర్వాత స్నానానికి నీళ్ళు ఇస్తారు. తర్వాత నల్లటి గుడ్డలు ఇస్తారు - ఆ తర్వాత కాలికింద చెక్క తొలగిస్తారు. ఇదీ క్రమం. ఈ క్రమం, ఈ వివరణ చెప్పకపోతే ఈ గీతానికి వచ్చే అర్థానికి, చెప్పిం తర్వాత వచ్చే అర్థానికి, రెంటికీ రచయిత బాధ్యుడే.

## * చేసేది గుమస్తా గిరి *

వి. సుబ్బయ్య

చేసేది గుమస్తా గిరి
తెచ్చేది పణానికే సరి
విసిగి వేసారిన ఓ శేషగిరి
వేసుకున్నాడు మెడకో ఉరి!
సామాన్య బ్రతుకుల సిరి
కిదొక మణిపూసలాంటి గిరి!

## * పెనంపై నుండి.... *

### పసుపులేటి రామారావు

పెనం మీద నుండి
పడ్డాను పొయ్యిలో!
నిన్నాకలయితే కలో గంజో
తాగేవాణ్ని!
ఇప్పుడాకలైతే గాలిమేసి
నీళ్ళు తాగాలేమో?

తోడేళ్ళను పిలచి, మీరు
మేకలని తినొద్దంటున్నారు!
రాజ మార్గాల్లో నల్ల దొంగలు
రాజాల్లా పోతున్నారు....
మతం కోసం పీకలు కోసిన
ఉన్మాదులు దండలేయించుకుంటున్నారు!
పుర్రెల పూజలు చేసిన వాళ్ళకి
మీటింగులెట్టి భజనలు చేస్తున్నారు!

అందుకే అంటున్నానయ్యా—
పెనం మీద నుండి
పడ్డాను పొయ్యిలో—అని!

## * కవిత్వం చెబుతాను *

### గంధం అప్పారావు

కవిత్వం చెబుతాను కాలానికనుగుణంగా
ప్రజా జీవితం ప్రతిబింబించేటట్లుగా
మానవత్వం మహనీయత వెలసేటట్లుగా
జ్ఞానదీప్తులు విశ్వవ్యాప్తమయేలా ॥కవిత్వం॥

మానవునిలో సోమరితనం నశించాలి
మంచితనం, మహనీయత పెంపొందాలి
దేశం సుభిక్షంగా వర్ధిల్లాలి
శాంతి భద్రతలు సమకూరాలి ॥ కవిత్వం ॥

కళలెందుకు? లలిత కళలెందుకు?
ఎందుకు కవిత్వం చెప్పాలి? ఎవరి కోసం?
మానవుడు మృగంవలె ఉండేవాడొకప్పుడు
మహనీయుడయ్యా డిప్పుడు ॥ కవిత్వం ॥

మానవుని అభివృద్ధికే కళలూ-లలిత కళలూ
అతని పురోగమనానికే కవిత్వం కావ్యాలూ
అతని మానసికాభివృద్ధికే సాహిత్యం
సవిమర్శనలూ
అందరినీ ముందుకు నడిపి,
ఆనందాన్ని కలిగించే
కవిత్వం వ్రాస్తాను కాలాని కనుగుణంగా!

ధనిక దరిద్ర భేదాలు లేని
దయాదాక్షిణ్యాలతో నిండిన
బాధ్యతాయుత నైతిక జీవనానికి
భవ్య నవ్య సమాజ నిర్మాణానికి
నా కవిత్వం అంకితం చేస్తాను
నా జీవితం ధన్యం చేస్తాను.

## * నవంబరు 7 *

### ఏల్చూరి సుబ్రహ్మణ్యం

అవునవును యీ నడిరేతిరి నిద్రించే
వాడెవ్వడు?
దాసాను దాసుడు;
అవు నవును యీ శుభ తరుణమ్మున
విలపించేవాడెవ్వడు?
పరమ లోభి;

అవునవును యీ నడిరేతిరి వింత
కావలింత ఏమి?
పెనవేసు కుంటున్నది మెరుపు తీగ;
అవునవును యీ నడిరేతిరి కన్ను
మూత పడదేమి?
చరిత్ర చెబుతున్నది దేవతా కథ;

అవునవును యీ నడిరేతిరి
కన్ను మూతపడ దేమి?
మానవుడైనాడు అనిమేషుడు!

(కొద్ది భాగం మాత్రం)

## * జంతు ధర్మం *

*పద్మపాణి*

అతను ఇతరుల్ని హింసించినప్పుడు
బాధించినప్పుడు లోకం ఆ ఇతరులు
అందుకు అర్హులని తగినవారని భావించి
అతని పక్కనే నిలబడింది!
ఏమిటి కారణం?

వారు బలహీనులట!
అమాయకులట!
అతను ప్రయోగించిన అస్త్రాలు
గురితప్పి ఎదురు తిరిగి అతనినే
బాధించినప్పుడు కూడా లోకం
ఆ సజ్జనులనే నిందించింది
ఏమిటి కారణం?

అతను బలవంతుడట!
తాము బాధపడి అతనిని తృప్తి
పరచవలసిన బాధ్యత
సజ్జనుల మీద ఉందట!

## * మార్చేదా? *

*హేమలత అంజనేయులు*

ఆ వేళ చెప్పావు
ద్వారబంధం చెదలు పట్టింది
మార్చమని.

ఆ వేళ చెప్పావు
గోడకున్న అద్దం పగిలింది
మార్చమని.

వినవయ్యా స్వామీ!
కృశిస్తోన్న శరీర చట్రంలో
నా హృదయ దర్పణం
పగిలింది
—అది మార్చేదా?

(హిందీ నుండి)

ప్రతి రోజూ ఉదయం వాళ్ళు నా కెదురవ తారు.

అతడూ - ఆమె....ఇద్దరూ యింకా చిన్న వయస్సువాళ్ళే.

అతని భుజం మీద బరువైన ఇస్త్రీ పెట్టె వుంటుంది. "సీత" లాగ ఆమె అతని వెం డుంటుంది.

"ఇస్త్రీ పెట్టెతో వీళ్ళు వుదయాన్నే ఎక్కడ కెళతారో?" నాలో నేననుకున్నాను.

ప్రతి రోజూ....ప్రతి ఉదయం....మ యింటి ముందు మురుఘవేల్ సంచార ఇస్త్రీ బండిని చూస్తాను. దాన్ని చూసినప్పుడల్లా ఇస్త్రీ పెట్టెతో వచ్చే ఆ జంట నాకు గుర్తొ స్తుంది.

## కథానిక అతడు - ఆమె

**వెంకటరాజ్ పానసె**

బహూశా అతనికి బండి లేదేమో! బం మరొకరిదై వుండవచ్చు! ఇస్త్రీ పెట్టె అ నిదై వుండొచ్చు. అంటే, బండుంటే ఎద్దుల్లేని, ఎద్దులుంటె - బండిలేని రైతులా వుం దతని పని.

ప్రతి రోజూ అదే చొక్కా, అదే పంచ

ఆమెక్కూడా అదే చీర—కాని నిన్న కంటె బాగా మాసిపోయి వుంటుంది.

ఒకవేళ వాళ్ళు మురికిపేట నుంచి కం కొట్టే మురుగు కాలవలు దాటుకుంటూ వస్తు వుండవచ్చు! ఇంతకూ అతను తానుం గుడిసెకు అద్దె కట్టగలడా? కనీసం 10-1 రూపాయలైనా వుంటుంది. ఈ ఇస్త్రీ పెట్టె సంపాదన ఎలా చాలుతుంది? లేకపోతే ఎవరో అద్దెకుంటె, వారి దగ్గర అద్దె కుదిరారా? కనీసం వాళ్ళు ఒక పూటైనా చా నంత తింటున్నారా?

ఇక, అతనికి భార్య అయిన ఆమెకు అత ఇచ్చే దేమిటి? ఆకలి మాత్రమేనా?

"మొగుడనేవాడు లేకుండా బ్రతకడం కష్టం!" ఆ చిన్నప్రాయంలోనే ఆమెకీ ఆలోచన తట్టి వుండవచ్చు.

నాకు వాళ్ళెదురవుతుంటారు—వాళ్ళిద్దరూ జంటగా నడుస్తారు.

వాళ్ళు నన్ను దాటిపోగానే, నేను వాళ్ళ వైపు చూస్తాను. ఆ జంట వీపులు. వాళ్ళు పోతూవుంటారు, అంతులేని మార్గంలో పోయేలాగా పోతూ వుంటారు. నేను చదివిన పుస్తకంలోదో, లేక నేను చూసిన సినిమాలోదో అలాంటి దృశ్యాన్ని జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తాను.

చూస్తుంటే, నడవడమే వాళ్ళ చాకిరీలా వుంది, ఈ చాకిరే వాళ్ళ శక్తినంతట్నీ తరి గించేసినట్టుగా దూరాని కెళ్ళి మాయమై పోతారు.

తిరిగి మరునాడుదయం నేనా రెండు ముఖాలను చూస్తాను.

నాలాగ వాళ్ళు బెడ్ కాఫీ త్రాగుండరు! దగ్గర్లో దొరికే ఇటుకరాయి పొడితో వాళ్ళు పళ్లు తోముకొని వుండవచ్చు. బజారు కొళాయి దగ్గర వాళ్ళు ముఖం కడిగి వుంటారు.

కాని యీ రోజెందుకో అతని కళ్ళెర్రగా వున్నాయ్. అలసి పోయిన ముఖం....భయం భయంగా చూస్తూ వుంది. ఓ గుడ్డ పేలిక తలకు గట్టిగా చుట్టి వుంది. అది నుదురును కప్పి వేసింది. అడుగులు బరువుగా వేస్తు న్నాడు. అయినా ఆ బరువైన ఇస్త్రీ పెట్టె భుజాన్నే వుంది. తనకు భార్య అయిన ఆమె అతని వెంటే వుంది. కమలంలాంటి ఆమె ముఖం పాలి పీక్కు పోయి వుంది.

జ్వరం వచ్చిందేమో. రాత్రంతా బాధతో నిద్ర పోయి వుండడు. నిస్సహాయంగా ఆ అమ్మాయి అతని ప్రక్కనే కూర్చోనుండ వచ్చు రాత్రంతా. తెల్లవారుజామున కోడి కూత. చేతులూ, కాళ్ళూ సాగదీసి వళ్ళు విరుచుకుంటాడు, విదిలిస్తాడు, వంటినొప్పులు కాస్త తగుతాయేమోనని. లేవడానికి ప్రయ త్నించి నొప్పులు తగ్గలేదేమో మళ్ళా చాప మీద వాలాడు, అమితమైన అలసటలో.

పొద్దు పొడవగానే, అతను లేవక తప్ప లేదు. జారిపోతున్న లుంగీని గట్టిగా బిగిం చాడు....యింకా గట్టిగా బిగించాడు. ఆమె చీర బిగించింది. ఇక మళ్ళా నిద్ర పోయే ప్రశ్న లేదు. బ్రహ్మరాక్షసిలావున్న జీవితం నోరు తెరిచి సిద్ధంగా వుంది వాళ్ళను మ్రింగ డానికి....వాళ్ళు త్రుళ్ళి పడ్డారు.

గబ్బు కొట్టే ఆ చీకటి గుడిసె నుండి బయట పడ్డారు. బలహీనతతో, నిరాశా నిస్పృహలతో-నిండు వెలుగులో జీవితా న్నెదుర్కొనేందుకు, అతను తన ఆయుధాన్ని తీసుకొని నిలబడ్డాడు.

తరువాత వాళ్ళు గుడిసె నుండి బయటికి వచ్చి వుండాలి.

మొదట:

అతడు—మొగాడు

తరవాత, అతన్ని వెంబడిస్తూ

ఆమె—ఆడది.

(కన్నడం నుండి)

"విమర్శ అనేది లేకపోతే ఏ వ్యాధి అయినా గట్టిగా పాతుకుపోతుంది. దానిని నయం చేయడం కష్టం. ధైర్యంగా నిర్మొహమాటంగా చేసే విమర్శ మనవాళ్ళు బాగుపడడానికి సాయ మవుతుంది, ముందు కడుగువేసే వుత్సాహం కలిగిస్తుంది. తమ పనిలో లోపాలు సరిదిద్దుకొనే ట్లు చేస్తుంది. విమర్శ లేనప్పుడు పాచిపోయి, ముడుగు తేలుతుంది. ముందుకు పోయేందుకు దారే వుండదు."

ఎ. ఎ. జదనోవ్.

సాహిత్యంలో స్త్రీల సమస్యల చిత్రణ గురించి 'అభ్యుదయ', అభ్యుదయ రచయితల సంఘం మద్రాసు శాఖ చర్చ సంగ్రహ పాఠాన్ని, కొన్ని వ్యాసాలను, ఒక సంపాదకీయాన్ని గతంలో ప్రచురించింది. ఆ సమస్యను విశదం చేసే యింకో రచన యిది.

# స్త్రీ పురుష సంబంధాలు

## సొదుం రామ్మోహన్

సమగ్ర మానవ సంబంధాలలో స్త్రీ పురుష సంబంధాలు ఒక భాగం. ఇది కొంచెం స్పష్టంగా చెప్పాలంటే మానవ సంబంధాలు సవ్యంగా, సామరస్యపూర్వకంగా వుంటే స్త్రీ పురుష సంబంధాలు కూడా అలాగే సవ్యంగా వుండడానికి అవకాశం వుంది.

ఫలానా భార్య భర్తకు పొసగడం లేదంటేనో, ఫలానా భార్యను ఫలానా భర్త వదిలేశాడంటేనో—ఆఁ ఏదో లెద్దూ అది వాళ్ళ సొంత గొడవ అని మనం కొట్టి పారేస్తూంటాం.

స్త్రీ పురుష సంబంధాలు సామాజిక సమస్య అన్న విషయాన్ని మనం చాలా వాటంగా మరచిపోతుంటాం. ఇందుకు ప్రధాన కారణం మనలో రక్తగతమై పోయిన పలాయన వాదం అనుకుంటా.

ఆడ, మగ సంబంధా లెప్పుడూ ఆనాటి సాంఘిక వ్యవస్థపై ఆధారపడి వుంటాయి. అంటే నేటి ఆర్థిక, సామాజిక పరిస్థితులు మూలం అయితే నేటి స్త్రీ పురుష సంబంధాలు ఫలితం అన్నమాట. సమాజం ఏమేరకు మారుతుందో స్త్రీ పురుష సంబంధాలు కూడా అదే మేరకు మారుతాయి. భారత దేశంలో బూర్జువా సంస్కృతి వ్యాపించి వుండకపోతే ఎంతమంది రాజా రామమోహన్ రాయ్‌లు ఎంతగా వుద్యమాలు నడిపినా, సతీ సహగమన దురాచారం అంతమై వుండేది కాదు.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో సైతం స్త్రీ విముక్తి సంస్థలు తామర తంపరగా పుడుతున్నాయంటే ఆ దేశాల్లో స్త్రీ స్వాతంత్ర్యం ఏపాటిదో వూహించుకో వచ్చు. "పురుషాధిక్య సమాజాల"లో స్త్రీ స్థానం ఎప్పుడూ ద్వితీయమే. పురుషుని స్థానమేమో ప్రథమం అయినప్పుడు వారిరువురి మధ్య సంబంధాలు సామరస్యపూర్వకంగా, సంతృప్తికరంగా వుంటాయనుకోవడం భ్రమ. ముఖ్యంగా సెక్స్, వివాహం, కుటుంబం—ఈ మూడు రంగాలలోనూ స్త్రీ పురుషుల సంబంధాల గురించి పరిశీలిద్దాం.

ఈ మూడు రంగాలలోనూ పూసల్లో దారంలాగా వుండవలసింది ఒకటుంది. అది ప్రేమ. స్త్రీ పురుషుల సంబంధాలకు పునాది వంటిది ప్రేమ. అది లేకపోతే వారి సంబంధాలు బెడిసిగొడతాయని ఈనాడు పిల్లలకు కూడా తెలుసు. స్త్రీ పురుషుల ప్రేమకు సంబంధించి సెక్స్ ప్రేమలో ఒక భాగం. కాబట్టి ఆ రెంటినీ మరీ విడదీసి చూడలేమేమో!

జీవితంలో సెక్సుకు అత్యధిక ప్రాముఖ్యం ఇవ్వడం ఎంత తప్పో, అతి తక్కువ ప్రాముఖ్యం ఇవ్వడం కూడా అంతే తప్పు. రెండూ హాని తెచ్చేవే. సెక్స్‌కు సంబంధించి ఆలు మగల మధ్య సంబంధాలు సవ్యంగా వుండాలంటే వారి మధ్య emotional harmony వుండడం తప్పనిసరి. అంటే వారి మధ్య మానసిక ఏకత వుండడం అవసరం. ఇంకొంచెం స్పష్టంగా చెప్పాలంటే స్త్రీ పురుషుల అలవాట్లు, అభిరుచులు, భావాలు, రాజకీయ అభిప్రాయాలు మధ్య ఐక్యత వుండాలి. ఇద్దరికీ సెక్సు జ్ఞానం, భర్తకు అదనంగా సెక్సువల్ పొటెన్సీ వుండడం అవసరం. భార్యకు కూడా సెక్స్ పట్ల "ఏహ్యాభావం" వుండకూడదు. సెక్స్‌ను పాపకార్యంగా భావిస్తే ప్రమాదమే.

సుబ్బలక్ష్మి పాట కచ్చేరీకి వెళ్దామా అని భర్త అడిగితే "ఎవరావిడ?" అని భార్య బిక్కమొహం వేసి ఎంక్వయిరీ చేసిందనుకోండి. ఇక వారి మధ్య మానసికమైన ఏకీభావం ఎలా కుదురుతుంది? సుప్రసిద్ధ మళయాళ రచయిత్రి కమలా దాస్ ఆత్మకథ (మై స్టోరీ) చదివితే మనకీ విషయం స్పష్టంగా తెలుస్తుంది. కమలా దాస్‌ది కాస్త ఎదిగిన సంస్కారం. ఆమె భర్తలో అదే కొరత. ఆమెను అతడు కేవలం లైంగిక వాంఛను తీర్చే వస్తువుగా పరిగణిస్తాడు. ఆమె నది మహాబాధ పెడుతుంది. ఫలితంగా వారి మధ్య వుండవలసిన పరస్పర అవగాహన, పరస్పర ప్రేమ వుండవు. అవి లోపిస్తే స్త్రీ పురుషుల సంబంధాలు నరకసదృశంగా మాత్రమే ఉంటాయి. ఇక వివాహం సంగతి.

వైవాహిక జీవితానికి ఎమోషనల్ హార్మనీతోపాటు ఇంటలెక్చువల్ హార్మనీ కూడా అవసరం. ఇంటలెక్చువల్ హార్మనీ అంటే మేధో సంబంధమైన ఏకీభావం. అంటే బాగా చదువుకున్న భర్త, ఓనమాలు కూడా రాని భార్య వున్నారనుకోండి. వారి మధ్య సంబంధాలు సాధారణంగా సామరస్యపూర్వకంగా వుండవు. ఆలు మగల మధ్య సంస్కారానికి సంబంధించి పూర్తిగా కాకపోయినా, కొంత మేరకైనా సమతూకం వుండాలి. శ్రీ లంక ఎన్నికల ఫలితాలు చూసి "అయ్యో ఆసియా ఎటు పోతోంది" అని ఆందోళన పడే భర్తకు, అసలు రాజకీయాలు తెలియని యువతి భార్యగా దాపురిస్తే వాళ్ళ సంబంధాలు ఎంత సంబరంగా వుంటాయో తేలిగ్గానే వూహించుకోవచ్చు.

ఆలు, మగల మధ్య మానసిక, మేధో సాన్నిహిత్యం లేకపోతే వాళ్ళ సంసారం ఎలా వుంటుందో తెలపడానికి రవీంద్రుడు ఒక కథ రాశాడు. దాన్నే ఆ మధ్య "ఉపహార్" అనే సినిమాగా తీశారు.

"ఈ నాడు మన సమాజంలో సాధారణంగా రెండు రకాల పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. ఒకటి ప్రేమ పెళ్ళిళ్ళు, రెండు ఏర్పాటు పెళ్ళిళ్ళు, ఏర్పాటు పెళ్ళిళ్ళంటే పెద్దలు ఏర్పాటు చేసినవి. ఏర్పాటు పెళ్ళిళ్ళతో పోలిస్తే ప్రేమ పెళ్ళిళ్ళ సంఖ్య చాలా తక్కువనే చెప్పాలి. బూర్జువా సమాజంలో అన్నీ వ్యాపార వాసన కొడుతున్నట్లే, మన పెళ్ళిళ్ళు కూడా ఫక్తు వ్యాపార వాసన కొడుతున్నాయి. పెద్ద చదువు చదవడం, భారీ కట్నం లాగడం రెండూ వ్యాపార నాగరికతకు చిహ్నాలే. ప్రేమ పెళ్ళిళ్ళే వికటించడానికి ప్రమాదం వున్న మన సమాజంలో, వ్యాపారం [కట్నం] పునాదిగా చేసుకున్న పెళ్ళిళ్ళు ఎంత కంపు కొడతాయో తేలిగ్గానే వూహించొచ్చు.

ఇకపోతే కుటుంబం సంగతి; మన సమాజానికి యూనిట్ కుటుంబం. ఇది ఆదిమ సమాజంలో లేదు. సొంత ఆస్తి పుట్టాకనే ఇది అవతరించింది.

ఒక కుటుంబంలో ఆలు, మగడు మాత్రమేకాక ఇతర సభ్యులు కూడా వుంటారు. మన కుటుంబాలకు చోదకశక్తి వంటిది ప్రైవేట్ ఆస్తి. కొత్తగా ఒదినె ఇంట్లోకి ప్రవేశించిందంటే పిల్లలూ పెద్దలూ మొదట గమనించేది ఆమె వెంట ఎంత కట్నంతో వచ్చిందని; లేక ఆమె వుద్యోగం చేస్తే నెలకు ఎంత సంపాయిస్తుందని; సాధారణంగా మన గౌరవాలన్నీ డబ్బుపై ఆధారపడ్డవే. భార్య భర్త లన్నవారికి ఇంట్లోని మిగతా సభ్యు లందరితోనూ సరైన సంబంధా లుంటేనే, లేకపోతే వాటివల్ల వీళ్ళ సంబంధాలు కూడా బెడిసికొట్టే ప్రమాదం వుంది. ఆలు మగల మధ్య సంబంధాలు సవ్యంగా వుండాలంటే విడి కుటుంబా లుండడం మేలు. అంటే ముసలి తల్లిదండ్రుల పట్ల, తమ్ముళ్ళు, చెల్లెళ్ళ పట్ల బాధ్యతలను విస్మరించాలన్నది కాదు నా అభిప్రాయం. వాటిని నిర్వర్తిస్తూనే విడి కుటుంబాలుగా వుండొచ్చు. ఏది ఏమైనా అవిభక్త కుటుంబాలు ఫ్యూడల్ వ్యవస్థ ఫలితాలు. ప్రతి ఒకరూ సొంత వ్యక్తిత్వం పెంచుకుంటున్న నేటి బూర్జువా సమాజంలో అవిభక్త కుటుంబాలు పొసగవు. ఇంతవరకు సెక్స్, వివాహం, కుటుంబం—ఈ మూడు రంగాలకు సంబంధించి స్త్రీ పురుషుల సంబంధాలను టూకీగా పరిశీలించాం.

ఇప్పుడు స్త్రీ పురుషుల సంబంధాలతో సంబంధం వున్న మరో రెండు మూడు విషయాలను గురించి ముచ్చటిద్దాం.

మొదటిది: స్త్రీ పురుషుల సంబంధాలకు ప్రేమ ప్రధానం. వైవాహిక జీవితం సవ్యంగా సాగాలంటే ప్రేమ తప్పనిసరి. ఆలు మగల మధ్య ప్రేమ లుప్తమైన తరవాత వారి మధ్య సంబంధాలు కేవలం యాంత్రికమైనవిగా, రసవిహీనమైనవిగా వుంటాయి.

"జీవితాన్ని, జీవించడానికి యోగ్యమైనవిగా చేసేవి రెండు వున్నాయి. ఒకటి కళ, రెండు ప్రేమ" అంటాడు సోమర్‌సెట్ మామ్.

రెండవది: కారణాలు ఏవైతేనేం—భర్త, భర్తగానూ, భార్య భార్యగానూ, కార్మికుడు కార్మికుడుగానూ బతకలేని సమాజ మిది. వారి వారి విధ్యుక్త ధర్మాల్లో, దైనందిన కార్యకలాపాలలో సాధారణంగా ఎవరికీ సంతృప్తి వుండక ఒక విధమైన వైమనస్యానికి (alienation) గురవుతుంటారు. "అనా కెరినినా" జీవితాన్ని విషాదాంతం చేసింది ఈ వైమనస్యమే. ఈ వైమనస్యం బారిపడకుండా స్త్రీ పురుషులు తమ సంబంధాలను రక్షించుకోవాలంటే మాటలు కాదు.

మూడవది: మనం స్త్రీ శీలానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నాం అనిపిస్తుంది; అంటే స్త్రీ శీలానికి సంబంధించి పురుషుడి సంస్కారం చాలా సంకుచితమైంది. ఈ సంకుచిత సంస్కారం చాలా అనర్థాలను తెచ్చిపెడుతుంది. మన వార్తాపత్రికలు తిరగేస్తే "శీలాన్ని శంకించిన భర్తచే భార్య హత్య" లాటి వార్తలు తరుచుగా కనిపిస్తాయి. మిడిల్ క్లాస్‌కు చెందిన భర్తలు ఈ హత్యాకాండకు తలపడరు కానీ, వాళ్ళు చాలా నీచమైన sadistic atrocities చేస్తుంటారు, భార్యలపైన.

పెద్ద పెద్ద డిగ్రీలున్న మధ్య తరగతి యువకులు రాత్రిళ్ళు పడక గదుల్లో పెళ్ళాల తొడలకు సిగరెట్ చురకలు అంటించడం మనకు తెలియంది కాదు. పురుషుని ఈ

సంకుచిత సంస్కారం పెరగడం అన్నది రెండు అంశాలపై ఆధారపడి వుంటుంది. మొదటిది తానుగా ప్రయత్నించి పెంచుకోవడం; రెండవది ఎదుటివైపు నుంచి, అంటే స్త్రీ వైపు నుంచి అందుకు వత్తిడి రావడం.

సమాజం మనుగడకు రెండు కార్యాలు అవసరం. ఒకటి ఉత్పత్తి, రెండు పునరుత్పత్తి. నేటి స్త్రీ పునరుత్పత్తి కార్యక్రమంలో మాత్రం ముమ్మరంగా పాల్గొంటోంది. ఉత్పత్తి కార్యక్రమంలో సైతం సహభాగస్వామిగా పురుషునితోపాటు పాల్గొంటే తప్ప ఆమె స్వేచ్ఛకు, తద్వారా స్త్రీ పురుష సంబంధాల సామరస్యతకు గట్టి హామీ వుండదు.

ఏమైనా స్త్రీ పురుష సంబంధాలు అనే ఈ అంశం చాలా సున్నితమైంది. మరి కొన్ని కొత్త కోణాల నుంచి ఈ సమస్యను పరిశీలిస్తే బాగుంటుంది. ఈ సమస్యలోని తీవ్రతను, సామాజిక తత్వాన్ని మనం అట్టే గుర్తించడం లేదనిపిస్తుంది. అసలు ఈ అంశం గురించి రాయాలంటేనే కొందరికి భయం.

ఈ నాడు బూర్జువా దేశాలలో చిన్న కారణాలకు కూడా భార్యాభర్తలకు విడిపోయే అవకాశం వున్నది. ఇది బూర్జువా సంస్కారానికి ప్రతీకే. ఆ మాట కాదనలేము.

అయితే సోషలిస్టు సమాజం కమ్యూనిస్టు సమాజంగా పరిణమించి కమ్యూనిస్టు సమాజం ఇంకా అభివృద్ధి చెందితే రాజ్యాంగ యంత్రం డుల్లిపోతుందంటారు. అలాగే విడాకుల చట్టం డుల్లిపోయే దశ ఎప్పుడొస్తుందో ఎవరైనా సామాజిక శాస్త్రవేత్త పరిశీలిస్తే బాగుండును. అంటే విడాకుల హక్కు వున్నప్పటికీ, ఆ హక్కును వినియోగించుకో నవసరం లేని దశ ఎప్పుడొస్తుందో!

# పాత రోడ్డు మీద

(పూర్వపు జార్జియా కథ)

**అహ్మద్ ఖాన్ అబూ-బకర్**

ఓ తూరి యిద్దరు నిరుపేద గిరిజనులు ఒక ఒక పాత రోడ్డు మీద కలిశారు. ఒకరిది జిల్‌బాచీ గ్రామం, మరొకనిది గులాట్టి. ఒకడు యింటికి తిరిగివస్తున్నాడు, మరొకడు ఏచోటికో వెళ్తున్నాడు. అలసీ, సొలసీ వారో కాలువ గట్టున కూచొని, నీళ్ళల్లో చద్ది రొట్టెను ముంచుకొని తినడం మొదలెట్టారు.

''శుభం, మీ రెక్కడి కెళ్తున్నారు?'' జిల్‌బాచీ గ్రామం మనిషి గులాట్టి గ్రామవాసిని అడిగాడు, రొట్టెముక్క రుచి చూస్తూ.

''వైస్-జరెంట్ సన్నిధికో ఫిర్యాదు తీసికొని టిప్లిస్ వెళ్తున్నాను.''

''నీవు చాలా దూరం వెళ్ళాలన్న మాట.''

''ఏం చేస్తాం తమ్ముడూ మరి, ఆ రక్త దాహకుల మూలంగా అక్కడ బ్రతుకే లేకుండా పోయింది.''

''అది సరే, మరి నీకు వాళ్ళ భాషొచ్చా?''

''కటిక దరిద్రుణ్ణి. వాళ్ళ భాష నాకెలా తెలుస్తుంది? ఈ రోజుల్లో భూమ్మీద రెండే రెండు భాషలున్నాయి. లేనోళ్ళ భాష, కలిగినోళ్ళ భాష, ఆ రెంటి మధ్య సామ్యమే లేదు- అంటే ఒకదానొకటి విభేదిస్తాయి.''

''నీవంటే నా కభిమానమే కాని తమ్ముడూ, నీ విషయం ఆయనకెలా వివరించి చెప్తావు మరి?''

''ఇలా'' అంటూ ఆ మనిషి చేతి సంచి తడివి, ఓ పెద్ద, శుభ్రంగా ఈకలన్నీ పెరికి వేసిన, ప్రాణంతో వున్న, కోడి పుంజును బయటికి తీశాడు.

''ఆయనతో చెబుతాను. ఆ రక్తపిపాసులు మమ్మల్నిలా చేస్తున్నారు అని ఆయనకి కోడిపుంజును చూపెడతాను. ఆయన అర్థం చేసుకో లేడంటావా?''

**కథానిక** # పొరపాటు

చందు సుబ్బారావు

బ్రహ్మానికి ఎవడికైనా సహాయం చెయ్యట మంటే మహా చిరాకు. 'వేలిరిగింది—కేవలం అల్పాచమానం వైద్యం' అంటే 'ఇప్పుడు ఖాళీ లేద'ని లేచ్చక్కా పోతాడు. ''ఊళ్ళో పాలూ, వంపులో నీళ్ళూ, బళ్ళూ, ఓడలూ అన్నీ తనకోసం స్వర్గం నుండి ఊడి పడ్డాయి. ఒకళ్ళతో పనేమిటి? పిల్లికి బిచ్చం వేస్తే బలిసి ఎలికల్ని తినటం మానివేస్తుంది. వీళ్ళందరికీ ఉపకారాలు చెయ్యటానికే నేమిటి నేను పుట్టింది....''....దాదాపు ఇదీ బ్రహ్మం బ్రతుకు వేదాంతం.

అయితే బ్రహ్మానికి తండ్రి పోలికొచ్చిం దేమో కాని, పాపం అతని తల్లి మరో రకం మనిషి.

ఊళ్ళోవాళ్ళందరికీ ఏదో ఉపకారం చేద్దా మన్న తాపత్రయం గలిగింది. పెళ్ళిళ్ళకు పిండివంటలు చేసి పెట్టా — పచ్చళ్ళు పట్టి పెట్టా—కడుపుతోన్న పిల్లలకు పుల్లగాయలు పంపించా—కాపురాలు చెడిపోతుంటే అడ్డం పడి అటూ ఇటూ నాయబారం సాగించా— కన్ను నీరు కారినా -కాలు లావు పారినా తెలి సిన నాటు వైద్యం తూ. చా. తప్పకుండా చేయించా—

ఊరంతా నా పిల్లలనుకునే మనిషి బ్రహ్మం తల్లి—బ్రహ్మానికి తల్లింటే మంట—కత్తితో కోద్దునా—గొడ్డలితో నరుకుదునా అనుకుం టాడు.

'గంగిరెద్దు ముండ—ఇంటింటికీ పోయి తలూపు తుంది. ఆడించుకుని పంపిస్తుం టారు—' అంటాడు బ్రహ్మం—

''ఊరంతా పనిమనుషులు పెట్టుకోవద్దని దండోరా వేయిస్తాను. అంట్లుతోముకుని బ్రతుకుదువు గాని....''—బ్రహ్మం!

'తప్పర్రా నాయనా—నలుగురు మేలో రిస్తేనే భగవంతుడు మన మేలోరుస్తాడు— ఏనాటి కే వారమో....పుణ్యం పెరట్లో చెట్టురా—నీరుపోసి పెంచుకోవాలి....' తల్లి!

'పెంచుకోవాలి—పెంచుకోవాలి— నిన్ను దొడ్లో పాతేస్తే మొక్కయి పెరుగు దువు గాని....' బ్రహ్మం ఆగ్రహం....

బ్రహ్మం ఇలాంటివాడని గ్రహించి వాళ్ళమ్మతో మాట సాయం కోరేవాళ్ళంతా బ్రహ్మం ఇంట్లో లేనప్పుడు వస్తుండేవాళ్ళు. 'అయనుంటే వచ్చెయ్యి' అని ఊళ్ళో తల్లు లంతా పిల్లలకు తర్ఫీ దిచ్చారు.

ప్రక్కింటి వెంకయ్య సన్నకారు రైతు. ఓ అర ఎకరం నిమ్మతోట కౌలుచేసుకుని బ్రతుకుతున్నాడు. భార్యకు ఒంట్లో నలత చేసినా, కూతురుకు కానుపొచ్చినా బ్రహ్మం తల్లే పరుగెత్తుకొచ్చేది.

'ఆవిడ రుణం ఎలా తీర్చుకోవాలో' అనుకుంటున్న వెంకయ్యకు ఆ ఏడు నిమ్మ తోట విరగ్గాసింది.

ఓ రోజు ఆనందంగా బంతుల్లాంటి రెండొందల నిమ్మకాయలు ఏరి సంచిలో పోసి చిన్నకొడుకు చేతికిచ్చి 'మామ్మ' గారి కిచ్చిరమ్మన్నాడు వెంకయ్య.

ప్రస్తుతం వున్న చట్టాన్ననుసరించి జేబు దొంగ పెద్ద అపరాధి (క్రిమినల్). కాని తన వాటాదార్ల కోట్ల రూపాయలు అవహరించినవాడు, కార్మికులకు యివ్వవలసింది యివ్వక ఖాజేసినవాడూ ఉత్త ఆర్థిక నేరస్థుడు మాత్రమే.

జార్జ్ ఫెర్నాండేస్

పిల్లవాడు పోయి బ్రహ్మం ఇంటి తలుపు తట్టాడు.

బ్రహ్మం తలుపు తీసాడు. ఉరిమి పిల్లవాడి వంక చూస్తూ 'ఏం నాయనా' అన్నాడు ముప్పావు వెటకారంగా.

పిల్లవాడు కంగారుపడి 'మరండీ-మామ్మగారండీ-నిమ్మకాయలండీ....' అన్నాడు.

బ్రహ్మం ఒక్కపట్టున లేచిపోయి, పిల్లిని చూసి పులి అనుకున్నవాడిలా ముఖంపెట్టి, 'నిమ్మకాయిలా - పచ్చడి పెట్టాలా - మాకేం పనుల్లేవనుకున్నారా - ముసిలిముండ లేదు - చచ్చిపోయిందని చెప్పు - పో నాయనా-పో-' అంటూ వెటకారాలూ, మిరియాలూ ఒలకపోసి పిల్లవాడి ముఖం మీద తలుపు వేసాడు.

పిల్లవాడు తిరుగుముఖం పట్టాడు.

సంచిలో నిమ్మకాయలకు నోళ్ళల్లో నీళ్ళూరాయి.

## లేఖలు

### 'అభ్యుదయ' గురించి

పత్రిక ఎంతో ఆసక్తికరంగానూ, అభ్యుదయ రచయితలకు ఆశాజనకంగానూ వుంటున్నది. ఇటీవల వెలువడిన ఆగస్టు 1977 సంచిక కూడా అంది ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. అభ్యుదయ రచయితల నందరినీ — వాళ్ళ భావాలనీ ఈ రూపంలో ఒక్క వేదిక మీదికి సమీకరిస్తున్నందుకు మదరాసు శాఖకు నా ప్రత్యేకమైన అభినందనలు. ఇదివరకు వచ్చిన వాటికన్న ఈ ఆగస్టు సంచిక గుణగణాల్లో అన్ని విధాలా మించి, సాహితీపరులను ముఖ్యంగా అభ్యుదయ భావాలుకల రచయితల్ని ఉత్తేజపరుస్తున్న దనడంలో సందేహం లేదు. ఇట్లాగా మీ కృషి నిరంతరాయంగా సాగాలని ఆశిస్తూ.

హనుమకొండ పేర్వారం జగన్నాథం

* * *

'అభ్యుదయ'ను సమగ్రమైన పత్రికగా మార్చడం ఎంతో సంతోషాన్ని కలిగించింది.

ఈ ప్రయత్నం అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ సాహిత్య పత్రికల్లో ఉన్నత స్థానాన్ని త్వరలో పొందగలదని ఆశిస్తున్నా.

వరంగల్ మాదిరాజు రంగారావు

* * *

'అభ్యుదయ'లో వెలువడుతున్న చిట్టికథలు-పొట్టికథలు (చిట్టి పొట్టి కథలు) చదవడానికి బాగుంటున్నాయి. ప్రగతిపథంలో నడుస్తూ, రచనలో తగినంత వేడిమి, వాడిమీ కలిగి వుంటున్నాయి. సంతోషం. వచన కవితలన్నీ చురుకుగా సాగి చురుక్కుమని పొడుస్తున్నాయి. అవీ ఆస్వాద్యంగా ఉన్నాయి. మీ సమితి వారి కృషిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నా.

ఆలిఘర్ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

* * *

'అభ్యుదయ' ఆగస్టు సంచిక చూసినాను. చాల నచ్చింది. తెనుగులో మరో విప్లవ గర్జన. ప్రఖ్యాత విప్లవకవి 'నజ్రుల్ ఇస్లామ్' గురించిన పుటంకింపు పురిపండావారు అభ్యుదయ చేతనతో రాసినారు. చిరకాలం జ్ఞప్తి వుంటుంది. చిరుకవితలు, కథలూ, సూక్తులు పత్రికకు వన్నె తెచ్చినాయి. పరదేశీయుల యొక్క కవితా పరిచయం—మీ పత్రిక విశాలత్వాన్ని వేయివేల గొంతులతో సాక్ష్యం పల్కుతున్నాయి.

బరంపురం 'గుల్నార్'

సెప్టెంబరు 4 (ఆదివారం) సమావేశం

1. 'ఆధునిక తమిళ సారస్వత రీతులు'
వక్త: శ్రీ మదివానన్

2. 'ఆధునిక కన్నడ సారస్వత రీతులు'
వక్త: శ్రీ సి. ఆర్. కృష్ణారావు

స్థలం: పొట్టి శ్రీరాములు స్మారక మందిరం
ప్రారంభం: సాయంత్రం 6 గంటలకు
అందరికీ స్వాగతం

# అభ్యుదయ

## ఏజెన్సీ నిబంధనలు:

* ఏజెన్సీ లేని ప్రతి చోటా 'అభ్యుదయ' విక్రయానికి ఏజెన్సీ యివ్వబడుతుంది.
* ఐదు ప్రతులకు లోపు ఏజెన్సీ అంగీకరింపబడదు.
* కావలసిన ప్రతుల మొత్తం మూల్యం నుండి 25 శాతం మినహాయించుకొని పైకం పంపాలి. పైకం అందితేనే కాని ప్రతులు పంపడం సాధ్యం కాదు.
* ప్రతి నెలా 15వ తేదీ లోపుగా కావలసిన ప్రతుల సంఖ్యను తెలుపుతూ పైకం మా కార్యాలయానికి చేరాలి.
* పైకం (మని ఆర్డర్, డ్రాఫ్ట్, పోస్టల్ ఆర్డర్) 'అభ్యుదయ' పేర పంపాలి.

'అభ్యుదయ',

15, **అరుళాంబాళ్ స్ట్రీట్**, మద్రాసు-600 017.

